


గ్రంథకర్త:— పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు

ఇది యొక అపూర్వ విచిత్ర కల్పనాసమేత మగు చక్కని నాటకము. కోకిల ధవునకై తండ్రిని త్యజించిన త్యాగశీల. భవ్యతర ప్రాసాదముల సుందరోద్యానముల సంచరించు సతీతిలకమైనను, భయద క్రూరమృగసంకీర్ణ భీకరారణ్యాంగణమున నిజధీరచారిత్రాభినయమున, మోహాంధుడగు మోహనుని హృదయాగారమున ప్రేమజ్యోతిని వెలింగించి, దమయంతీ అనసూయాదుల మరపించిన పాతివ్రత్యవిరాజిత. అసూర్యంపశ్యలైనను పురుషుల భోగలాలసతాతృప్తికై నిర్మింపబడిన క్రీడాపదార్థములుగాక, సతులు పురుషులకన్న నేమియును తక్కువకారని లోకమున చాటుటకో యన రాజ్యపరిపాలనాభారము వహించిన రమణీమణి. ఈ నాటకము శృంగారరసమునకు నిలయము. శృంగారమున కరుణ, కరుణయందే భీభత్సము, దాన రౌద్రము, దానియందే హాస్యము. అంతయు నొక్కరంగమునందే! పసితనమునందే తలిదండ్రుల బాసి, కారాగారమున బద్ధుడై, వేదాంతియైన వసంతకుడు, వేదండయానకు దాసుడై కథానాయకత్వమును వహించును. తరువాత విచారణస్థానమున ప్రణయిని కోకిల విచారణీయస్థానమున నిందితులు ప్రేమస్వరూపిణులగు జనకుడు, దైవసముడగు ధవుడు. విచారణారంగభూమి యతికంబ ప్రాంతము. నేరారోపణచేయునది కోకిల. దీన ప్రపంచమున స్థాపింపబడు నీతి తరుణీమణులయవ్యాజప్రేమ. ఈ యత్యద్భుత సంఘటనాశక్తియు, తన్నిర్వహణనైపుణియు, స్త్రీలను పురుషుల జేసి, పురుషునకబలవేసమునిచ్చి, యపూర్వప్రణయసంభాషణాకల్పనల మెప్పించు శైలియు. ఈ కవిశేఖరునియందే, యీకవి విరచితమగు నీ కోకిలనాటకమునందే చూడదగును. వెల రు. 1-0-0 మాత్రమే.

---

వలయువారిట్లు వ్రాయవలెను:—

## కురుకూరి సుబ్బారావు అండ్ సన్.

ప్రొప్రయిటర్సు, సరస్వతీ బుక్ డిపో, బెజవాడ (కృష్ణాజిల్లా)

# హనుమద్రామసంగ్రామము.

ఐదంకముల నాటకము





గ్రంథకర్త

యస్. పార్థసారధిశర్మగారు

ప్రకటనకర్తలు

కురుకూరి సుబ్బారావు అండ్ సన్.

ప్రొప్రయిటర్సు

సరస్వతీ బుక్, డిపో;

బెజవాడ.

మొదటి కూర్పు 1000

1940

డక్కన్ ప్రింటింగ్ వర్క్సునందు

ముద్రింపబడియె



వెల 0-8-0

## —: ఇందు వచ్చు ముఖ్య పాత్రధారులు :—

—: o :—

పురుషులు :—

| | |
|---|---|
| యయాతి | రాజు |
| మతిమంతుడు | మంత్రి |
| వసిష్ఠుడు | |
| విశ్వామిత్రుడు | |
| భరద్వాజుడు | ఋషులు |
| నారదుడు | |
| శ్రీరాముడు | |
| లక్ష్మణుడు | |
| భరతుడు | |
| శత్రుఘ్నుడు | |
| ఆంజనేయుడు | శ్రీరామభక్తుడు |
| సుగ్రీవుడు | |
| అంగదుడు | వానరవీరులు |
| జాంబవంతుడు | |
| ఈశ్వరుడు | |

స్త్రీలు :—

| | |
|---|---|
| సీత | శ్రీరాముని భార్య |
| చంద్రకళ | యయాతి భార్య |

ఓమ్.

శ్రీ రామా!

# హనుమద్రామ సంగ్రామము

## ప్రథమాంకము

---

మొదటి రంగము—సరయూనదీతీరము.

[ప్రవేశము—నారదుఁడు.]

అనుబంధము 1

నార—ఔరా! నా బ్రదుకుఁదెఱవు నాకే యాశ్చర్యమును గొల్పుచున్నది గదా!

సీ॥ అవని సద్రసోపేత భ । క్ష్యములఁగుడిచి
మధుర పానీయములఁ గ్రోలు । వారలుండఁ;
గడుపు చున్నాఁడ మూఁడు లో । కములయందుఁ
బ్రొద్దు; పోరోగిరము తిండి । పోతునగుచు.

స్వర్గమర్త్య పాతాళ లోకములు మూఁడును నన్ను గలహాశన నామముతోనే వ్యవహరించుచున్నవి. నా కలహోత్సాహము సర్వజనాహ్లాద సంధాయకం బనుటలో నత్యుక్తి లేదుకదా! మహాపురుషుల హృదయ ప్రవృత్తులను లోకమున కెఱుకపఱచి, వారి గౌరవాన్నతను ద్విగుణీకృత మొనరింపజేయుటకే నేను

దగవులను గల్పించు చుందును. (కొంచెమూగి) ఇఁక నిపుడు కర్తవ్యమేమి? కొలఁదికాలము క్రిందట నమరావతీ పురిని దేవేంద్రుఁడు చింతామణీసింహపీఠి నుపవిష్టుఁడై కొలువుండఁగాఁ బ్రసంగవశమున నెవ్వఁడో యొక ఋషిపుంగవుఁడు— 'శ్రీరామాంజనేయు లన్యోన్యానురాగ పాశబద్ధులు, అయ్యు భయులకు భేదమెన్నఁటికిని గలుగదు'—అని నుడివినాఁడు. ఆమాట నాచెవులఁబడినది మొదలు నా మనసు పనిచేయుచునే యున్నది. హనుమద్రాముల మధ్యఁ గలహాగ్నిఁ బ్రజ్వలింపఁ జేయుటకు సర్వప్రయత్నములు గావింప వలయును. (సందేహ మభినయించుచు) ఆఁ, ఏమి! ఈకార్యము నాకు సాధ్యమగునా? మేనులు రెండయ్యుఁ బ్రాణము లొండుగా శ్రీరామాంజ నేయులు చెలంగుదురుకదా!.........అయిననేమి? ప్రయత్న మొనరించినఁ గానిపనియున్నదా! బుద్ధిమంతుని కసాధ్య మున్నదా!

గీ॥ శాంతశీలుని కుండఁడు । శాత్రవుండు,
కవికి నెందు విదేశంబు । గాంచ లేదు,
పొసగ దుద్యోగికిని దూర । భూమియొకటి,
అరయ బుద్ధిమంతుని కసా । ధ్యంబులేదు.

నిద్రించు సింగము నోర మృగములు దమంతఁజొరవుగదా! కార్య సాఫల్యమునకుఁ బ్రయత్నమవసరముగదా! నే నీకార్యమునఁ దగిన వెరవాలోచించి సాధించితీరదఁగాక!

[అంత నేపథ్యమున]

గీ॥ "మిట్టమధ్యాహ్నమాయెను । మిహిరుఁడదిగొ
చండకిరణాళిఁబఱపియా । జగతినెల్ల
వేల్చుచున్నాఁడు! చాలించి । వేఁట మీరు
శ్రమను బోఁగొట్టుకొనుఁడు, కి । రాతులార!"

(ఆలకించి) ఈపలుకులంబట్టి చూడఁగా నెవ్వఁడో యొక్క భూపురందరుండు క్రూరమృగసందోహ సంహరణార్థమై మృగ

మృగయావినోదినై యీ సరయూనదీ ప్రాంతారణ్యముల కేతెంచి నట్లు తెల్లమగుచున్నది. దుస్సహంబగు నెండవేడిమిలో నే నిందుండఁదగయనేల! దగ్గఱనున్న మున్యాశ్రమంబుల కరిగెదఁగాక!
[హరినామ సంకీర్తన మొనరించుచు నిష్క్రమించును.]

తెరపడును.

రెండవరంగము—భరద్వాజాశ్రమోపాంతభూమి.

(ప్రవేశము—యయాతి.)

యయా—(అలసట నభినయించుచు) అబ్బా! మరణమాసన్న మగు కొలంది సంసారాభిలాష యభివృద్ధి యగునట్లుగా, గమ్యస్థానము చేరువయగుచున్న కొలంది నాత్రి మెక్కుడగుచుండును. (ఒకవృక్షచ్ఛాయ నాశ్రయించి) ఆహా! ప్రతిఫలాపేక్షలేక, పాంథులకు సర్వవిధముల నుపకరించుచున్న యీ మహీజము ప్రాణికోటిలో నెల్ల మిన్నయగునుగదా! (కొంచెమాఁగి) నేఁ డేలనో హృదయమునఁ బ్రతిక్షణ మశాంతియే పొడముచున్నది. మన సేదియో కీడునే శంకించుచున్నది. ఇందులకుఁగారణము మృగయావినోదమా? ఆ! ఏమీ! వినోదార్థమై నేను వేఁటకు వచ్చితినా? కాదు-కాదు-కేవలము ప్రజల ప్రార్థనములమీఁద-వారి యర్థప్రాణములను సంరక్షించుటకొఱకు - క్రూరమృగ సంతానంబువలన భయపడుచున్న సాధుజనులను గాపాడుట కొఱకు. కాకున్న నిట్టి కఠినవృత్తికి నాహృదయ మంగీకరించునా? (ఎడమకన్నదురఁగా) అకటా! ఇదేమి? ఎడమకన్నదురు చున్నది! ముందేమి ముప్పురానున్నది? మదీయ ధనుర్విముక్త సునిశితమార్గణం బేసాధుజంతువునయిన నిర్హేతుకముగా బాధించియుండునా? ఏమో, ఎవరుచెప్పఁగలరు? త్రాగి యొడ లెఱుంగక యిచ్చవచ్చిన మచ్చునఁ బ్రేలువానినోటినుండి

సూక్తిదురుక్తులు రెండును వెలువడునట్లు, వేటలేమకంబున మైమరచినవాఁడు సాధుజంతువులను క్రూరజంతువులనుగూడఁ జంపును. ఇంతకుఁ దెలియక చేసినదోన మేదయిననున్నఁ గరుణార్ద్రహృదయుఁడగు నీశుఁడే రక్షింపవలయును. (ముందు చూచి) కనఁబడుచున్న యీ యాశ్రమమునందు వసిష్ఠ భరద్వాజ మునీంద్రులున్నట్లు భృత్యుఁడు చెప్పినాడు. నే నా పూజ్యులను సందర్శించి, ధన్యుండనయ్యెదఁగాక!

గీ॥ పడుచుపెండ్లాముతోడి సం। భాషణంబు
వృద్ధునకుఁ జెప్పరానంత। ప్రీతిఁగూర్చు;
గష్టమాసన్నమై మది। కలఁగ హాయి
ధర్మపరుఁ డొందు మునుల సం। దర్శనమున.

(నిష్క్రమించును.)

తెర పడును.

మూఁడవ రంగము—ఆశ్రమాంతర్భాగము.

(వసిష్ఠ విశ్వామిత్ర భరద్వాజ నారదులుపవిష్టులై యుండఁగాఁ దెరలేచును.)

నార—(తనలో) పులియు నడవిపందియు నొక్కచోటనే యున్నవి. ఇఁకఁ బోరునకుఁ గొదువయేమి? మదీయాశయమున కీవసిష్ఠ విశ్వామిత్ర సహజవైరము నిమిత్తముగాకపోవునా? (ప్రకాశముగా) వసిష్ఠమునిపుంగవా! నేఁడు సుదినము. తలవనితలంపుగా నిన్నుఁజూడగలభాగ్యము నాకిచ్చట కలిగినది.

విశ్వా—(తనలో) ఈ కలహప్రియుఁడు నన్నింకను బలుకరింపనయిన లేదు. నాకంటె వసిష్ఠుఁడు మేటియని వీని యభిప్రాయము కాబోలు!

భర—బ్రహ్మమానస పుత్రా! ఈ గాధినందనుని సందర్శన మహాభాగ్యము నాకును అప్రయత్నముగనే కలిగినది.

నార—[ఆశ్చర్యమభినయించుచు] ఓహో! గాధినందనుఁడా! [విశ్వామిత్రునివంకఁదిరిగి] ఇఁకఁగావలసిన దేమున్నది? నేఁడు నాకుఁ బర్వదినము.

భర—[తనలో] అగును. కాకేమి? ఏ తగవంటునఁ బొసగించి కులుక వచ్చును.

నార—విశ్వామిత్ర మహర్షిచంద్రమా! నే నింత వఱకు నిన్నుఁజూడనే లేదు. కేవలము వసిష్ఠుని సందర్శించి నాహృదయ మానందాబ్ధి నోలలాడు చున్నది. ఇఁక నిన్నుఁజూడఁగలిగినపిమ్మటఁజెప్ప వలయునా?......మీరు మువ్వురు నింతవఱ కేయిష్టాగోష్ఠిం దవిలిరి?

భర—ఇష్టాగోష్ఠి కేమున్నది? విశ్వామిత్రుఁడు, తన ప్రియశిష్యుండగు శ్రీరామచంద్రుని సద్గుణసంపత్తిని, హనుమంతుని స్వామిభక్తి పరాయణతను వర్ణించి చెప్పుచుండఁగాఁ గర్ణరసాయనముగా నాలకించి తరించుచుంటిమి.

నార—ఆహా! అంతకంటెఁ గావలసిన దేమున్నది!

గీ॥ వచ్చియును రాని బిడ్డని । పలుకులెట్లు
కన్నతల్లికి సంతోష । కారణంబొ,
అటులనే కదా భగవంతు । నమలదివ్య
సుగుణ సంపత్తి వర్ణన । సుజనులకును.

విశ్వా—[స్వగ] అటులయిన నేను దెలిసియుఁ దెలియని మూర్ఖుఁడ నని వీని యభిప్రాయమా!

వసి— నారదా! హనుమద్రామసంబంధము బహుదృఢమయినది సుమీ!

నార—ఏమీ! హనుమద్రామ సంగ్రామమా?

భర—[నవ్వుచు] కొంప ముంచితివి. పూజ్యుఁడగు వసిష్ఠుఁడు హనుమద్రామ సంబంధమనఁగా, హనుమద్రామ సంగ్రామ మనుచున్నాఁడవా? దానికిఁగూడ నీవు ప్రయత్నించుచున్నాఁడవా

యేమి? నీకుఁబుణ్యముండును. లోకసంక్షోభమును దెచ్చి పెట్టకుము.

నార—నాకట్లు వినిపించినది. అంతే. హనుమద్రామ సంగ్రామమును నేనెట్లుకల్పింతును? అది సాధ్యమా?

భర—నీ వసాధ్యుడవు.

విశ్వా—(స్వగ) వసిష్ఠ భరద్వాజ నారదులు ముగ్గురును స్వోత్కర్ష గలవారే. వీరికాత్మస్తుతియన్నఁబ్రీతి. నారద భరద్వాజులిరువురును వసిష్ఠునుద్దేశించు నపుడు విశేషణము వాడకమానరు. నేనాతనితో సమానుడనుగానా! కానిమ్ము. సమయమువచ్చి నపుడు శక్తిఁ జూపించెదను.

[పదముల చప్పుడు వినవచును.]

వసి—(ముందుఁజూచి) ఎవ్వరో యిటు వచ్చుచున్నారు. (పరికించి) వేషముంబట్టి చూడఁగా నొక్క మహారాజని తోఁచుచున్నది.

నార—ఆతిథ్యమునుఁ గోరి యెవ్వరయిన రావచ్చును. ఎండవేడిమి యట్లున్నది.

[ప్రవేశము—యయాతి]

యయా—(ముందుగా వసిష్ఠునిజూచి) అహా! ఏమి నాభాగ్యము! పూజ్యులగు వసిష్ఠభగవానులను గాంచఁగల్గితిని. (చేతులు మోడ్చి) దేవా! వసిష్ఠ మునీంద్రా! త్వదీయ భృత్యుఁడు యయాతిభూపాలుఁ డిదే నమస్కరించుచున్నాఁడు. (మోకరిల్లును.)

వసి—(యయాతిని లేవఁదీసి) వత్సా! రమ్ము. ఈ యాసన మలంకరింపుము.

యయా—(పిమ్మటఁబ్రక్కకుఁదిరిగి భరద్వాజుని గనుఁగొని) భరద్వాజ మునీంద్రా! వందనము.

భర—ఈప్సితార్థప్రాప్తిరస్తు! నాయనా! ముందుగాఁగూరుచుండుము. ఎండలో నడచివచ్చితివని ముఖచిహ్నములు చెప్పకే చెప్పు చున్నవి.

నార—(తనలో) సమయముచిక్కినది. విశ్వామిత్రుని కోపాగ్నిరగు ల్కొల్పి యింధనములు చేర్చెదంగాక! (విశ్వామిత్రునితో మెల్లగా) గాధేయా! చూచితివా? తుదకు నిన్నుమన్నింపనయి నలేదు.

యయా—(ఆసనమునం గూర్చుండి హఠాత్తుగా విశ్వామిత్ర నారదులను గనుంగొని లేచి వినయమభినయించుచు) బ్రహ్మమానస పుత్రా! నమస్కారము.

నార—ఆయురారోగ్య భోగభాగ్యాభివృద్ధిరస్తు! నామాటకేమి? రాజ చంద్రమా! కౌశికమునీంద్రులవారు వీరు. ఇంతవఱకుం జూడనే లేదు.

యయా—(విశ్వామిత్రుని పాదములపైఁబడి) స్వామీ! మన్నింపుఁడు. ఎండవేం......

విశ్వా—(అర్థోక్తిలోనే పండ్లు పటపటంగొరుకుచు) ఓరీ! మూఢా! రాజకులాధమా! ఏమనుచుంటివి? మన్నింపుమనియా! కాదు-కాదు-దహింపుమని పలుకుము. నీ నిర్లక్ష్య స్వభావమునకు-నీ నికృష్టప్రవర్తనమునకు-నీ సంపదంధత్వమునకు-నీ నితాంత గర్వమునకు-నీ హేయసంభాషణమునకు-నిన్ను భయంకర క్రూర కఠోర ప్రస్ఫుట ప్రకోపాగ్ని జ్వాలామాలికలచే వ్రేల్చ వలయునుగాని, మన్నింపవలయునా? గర్వాతిరేకమునం గన్ను మిన్నుఁగానక గిరునం దిరుగుచున్న నీశిరమును ముక్కముక్క లుగం జేయవలయును. కృత్రిమ వినయగర్భిత వచనోద్భవ స్థానంబగు నీజిహ్వను నిశితఖడ్గంబునం జెండవలయును. మద ముచేం బొరలుగ్రమ్మిన నీనేత్రముల నూడంబెఱుకవలయును. పొమ్ము. నా సమ్ముఖమునుండి తొలంగుము. (అని కాలితోం దన్నును.)

నార, వసి, భర—(తెల్లఁబోయి చూచుచుందురు)

యయా—(విశ్వామిత్రుని పాదముంబట్టుకొని) మహాత్మా!

సీ॥ గంగానదీతోయ । సాంగత్యవశముచేఁ
బరిపూతమౌ భూమిఁ । దిరుగునెద్ది?
సంతతారాధనా । సక్తభక్తాళిచే
ననుదినంబును మ్రొక్క । లందునెద్ది?
వైరిదోర్గర్వని । ర్వాపణ దీక్షాతి
దక్షమై యరులనుఁ । దన్నునెద్ది?
పదునాల్గు లోకముల్ । పాలించురాజుల
వందనార్చనములఁ । బడయునెద్ది?

గీ॥ అట్టి భవదీయ దివ్యపా । దాంఘ్రి యుగము
నొప్పిఁ జెందదె? యేనైనఁ । దప్పులున్న
నాయుధంబీయనే మీకు । నమలచరిత!
దానితోడను దండింపఁ । దగదె నన్ను!

విశ్వా—[క్రోధాతిరేకముతో నట్టహాస మొనరించుచు] ఔరా! ఏమను చున్నాఁడవు? ఆయుధంబిత్తునా? ఎందులకు? నిన్ను ఖండించుటకు ఖడ్గము గావలయునా? భస్మీభూత మొనరించుటకుఁ జిటపెటార్భటులతో రగుల్కొను మంటలు గావలయునా? రూపుమాపుటకు నాభీల విషప్రయోగనైపుణి గావలయునా? వలదు-వలదు. మునులకు నాయుధములతోఁ బనిలేదు. నా వాక్కు నీపాలిటఁ గక్కుల కత్తియై నిన్ను బధింపఁగలదు. నా మాట యీటెపోటయి నీ హృదయమున నాటఁగలదు. నా శాపము నీభార్యకు వైధవ్యసంతాపము గూర్పఁగలదు. తెలియునా?

భర—[చెవులు మూసికొని] శ్రీహరీ! ఎట్టిమాటలు వినఁబడుచున్నవి!

విశ్వా—వినుటకిష్టము లేకున్నఁ జెవులు మూసికొనుము.

వసి—విశ్వామిత్రా! పూజ్యుఁడగు యయాతి భూపాలు నకారణముగా దూషింతువేల ? ఆతిథ్యమిచ్చి సత్కరించుటకు మాఱుగా దుర్భాషలా?

విశ్వా—[కోపముతో] పిలువని పేరంటకమునకు నీవేల సిద్ధపడెదవు? ఈ యధముఁడు నీకుఁబూజ్యుఁడు. నీవీతాజ్యునకుఁబూజ్యుఁడవు. అగును. కాకేమి? వీఁడు నిన్ను సత్కరించినాఁడు; గనుక నీవు వీనిని సత్కరింప వలయును. ఇఁక నోరులమాటయేల?...... ఓరీ! యయాతీ! నేను నీ కరాతిని. నీపాలిటఁ గాలమృత్యువను. నిన్ను సంహరింతును. నీవు, భక్తిశ్రద్ధలతో--వినయ తాత్పర్యములతో-మధుర మంజులా లాపములతో-స్తోత్ర పాఠములతో సత్కరించి,పూజించి, క్రిందఁబడి మ్రొక్కి యీబకపు జడదారికి దాసోహ మంటివి గదా! వీఁడు రక్షింపఁగలఁడేమో కనుఁగొనుము.

భర—విశ్వామిత్రా! శాంతింపుము. కోపమును దిగమ్రింగుము.

గీ॥ ధనికునకు లోభగుణము సం । తాపమిచ్చు;
సిగ్గు లేమియే స్త్రీలను । జెఱచునెపుడు;
తొందరయె రాజుఁ గీర్తి । దూరుఁజేయు;
మునుల కెందును గోపంబె । ముప్పుదెచ్చు.

బ్రహ్మర్షి పట్టభద్రుండవగు నీకొరులు చెప్పవలసిన దేమున్నది? ఈ యయాతి సంపదభియాతి; కుజనారాతి; ఈతఁడు నీయెడలఁ జేసిన యపరాధ మేమి?

విశ్వా—అపరాధమా? పరాభవము-మానసష్టము. అభిమానధనుండు ప్రాణములఁ గోల్పోవుట కంగీకరించును గాని, మానహాని కొప్పఁడు. మిమ్ములను గౌరవించి యీ నృపాలాధముఁడు నన్ను సరకుఁగొనలేదు. కానిమ్ము, ప్రతిఫలము-ప్రాణనాశము.

భర—విశ్వామిత్రా! నిన్నీ రాజశేఖరుఁడలక్ష్యము సేయలేదు. ముందుగా వసిష్ఠునిజూచి నమస్కరించినాడు. తదుపరి నీకుఁ బ్రణమిల్లినాడు. ఇంతమాత్రమున కింతపోరాట మేల? శాంతింపుము. ఈతఁడు రాజమాత్రుఁడు కాఁడు.

సీ॥ నిజయశశ్చంద్రికల్ । నిఖిలదిక్కులునిండ
నేల నేలిన మహీ । పాలుఁడితఁడు

సత్యవాక్పాలనా । సక్తియే సత్కీర్తి
కరమువంచుఁదలచిన । ఘనుఁడితండు
మత్తారిరాజన్య । మకుటపాళినిగాసి
గాలుమోపని శౌర్య । కలితుఁడితఁడు
శ్రీరామపాదసం । సేవయే స్వీయధ
ర్మంబని బోధించు । భక్తుఁడితఁడు
గీ॥ స్వప్నమందైన దోషంబు । సలుపఁడితఁడు
ధర్మమార్గంబు నుంతయుఁ దప్పఁడితఁడు,
పరుషవాక్యములనెప్పుడుఁ । బలుకఁడితఁడు;
అలుకఁబూనుటదగునె? యి । య్యనఘుపైని.

వసి—విశ్వామిత్రా! ప్రశాంతింబొందుము. ఇనకులాభరణాయమానుండు-నిగర్వచూడామణి-మూర్తీభవించిన సద్గుణముల ప్రోవు-కరచరణాద్యవయవములం గైకొన్న భక్తి-అనఁదగిన విఖ్యాత మహాపురుషుని నిర్హేతుకముగా దూషింతువా?

చ॥ సరసుఁడు, సాధువర్తనుఁడు । శస్త్రగుణాఢ్యుఁడు, యశఃప్రపూర్ణుఁడై
పరఁగెడు భాగ్యశాలి, మృదు । భాషలఁ దీనులఁ బ్రోచువాఁడు, శ్రీ
హరిపదసేవతత్పరుఁడు । నార్యుఁడు, భూపతి, వీని నింతఁగాఁ
బరుసములాడి తిన్నటది । పాడియె? మానులు మెత్తురె యిట్టి
చర్యలన్?

విశ్వా—నీవంటి వృద్ధ జపప్రియులగు మానులు మెచ్చిననాకేమి? మెచ్చకున్ననాకేమి?

నార—(తనలో) నాకుఁగడుపునిండఁగూడు దొరకినది.

యయా—దేవా! ప్రథమమున నేను మిమ్ములను జూడలేదు. అయ్యది నా నేరమే కావచ్చును! కాని మిమ్ములను గేలసేయు నుద్దేశము నాకుఁగలనయిన లేదు. అనివార్యశక్తిసంపన్నులు-అపరిమేయ కీర్తిపరిపూజ్యులు-అకళంకతపోధనవిస్తారులు నగు మిమ్ములను నేను పరిభవించుటయా! శ్రీహరీ! ఎంతమాటాడితిరి! గురుదేవా! తావకీయానూన దివ్యప్రభావంబు నేనెఱుంగనిదా!

సీ॥ రాజ్యభూతిని దృణ । ప్రాయంబుగా నెంచి
వనసీమలోఁ దపో । భారమూని
బ్రహ్మర్షి బిరుదు సం । పాదించి, నియతిచే
నిందుశేఖరుని మె । ప్పించి మించి
యలఁ దిశంకుని స్వర్గ । మందుఁ బ్రతిష్ఠించి
బ్రహ్మసృష్టికి సృష్టి । మరలఁ జేసి
అవతార పురుషుడై । యవతరించినయట్టి
రామచంద్రునకు న । స్త్రములనొసఁగి

గీ॥ అకటకట! సర్వ గీర్వాణ । మకుటఘటిత
మణిగణాలంకృత పదాబ్జ । వంద్యులయిన
మిమ్ము, సామాన్యునిఁగ నెంచి । పరిభవింప
నెంతవాఁడను నేను! ము । నీంద్ర! చెప్పుఁడీ.

ఎవ్వఁడయినఁ గొఱవితోఁ దలగోకికొనునా! దేవా! మిమ్ముల నలక్ష్యభావముతోఁ జులకనచేయుటకు నాకు మీఁగు గావించిన దోషలేశ మేమున్నది? ఉన్నను, నేనందులకు సమర్థుఁడనా? పిచ్చుకపై బ్రహ్మాస్త్రమన్నట్లు దీనుండను, విశేషించి మీ యధీనండను నగు నాపై మీకింతకోపమా?

విశ్వా—(కోపముతో) అధమా! నోరెత్తకుము. నీవు వసిష్ఠాధీనుఁడవు. మాయధీనుఁడ వెట్లగుదువు? అంకుటాలికి సుద్దులు మెండు. ధూర్తునికి వినయమధికము. విశ్వామిత్రుని సామాన్యమానవునిగా నెంచితివా?

సీ॥ ప్రళయ కాలోద్భవ । భయద నిర్ఘాతాళి
వెన్నఁ పైఁ బడినఁ ద । ప్పింపవచ్చు
నామ మాత్రాభీల । సామజ సంహార
సింహకిశోరముం । జెనకవచ్చు
దుర్దమదారుణ । దుఃఖ ప్రదాయక
శమన పాశము । గేలి సలుపవచ్చు

చటుల భీకర జగ । త్సంచార ఢాకినీ
కోటి నొక్కుమ్మడిఁ । గూల్పవచ్చు
గీ॥ నిర్జితాఖిలలోక ని । ర్ణిద్రయశుని
ఖండితాసుర శాత్ర వా । ఖండశక్తుఁ
జండ కౌశికు నొప్పించి । జగతినింక
బ్రదుకఁగలవాకొ? తుచ్ఛుఁడా । బ్రతుకఁగలవె?

కిటికేసరి శార్దూలగండభేరుండాది నానావిధ క్రూరజంతు సంతానంబు నీపై జాలిఁబూని నీయండనుండుఁగాక! రథగజ తురంగపదాతులు నీకు సాయము సలుపుఁగాక! యక్షకిన్నర కింపురుష సుసిద్ధ సాధ్యరక్షోవల్లభులు నీశిక్షను దప్పింప దీక్షఁబూని దక్షులై వత్తురుగాక! వేయేల! అష్టదిక్పాలకులుఁ ద్రేతాగ్నులు, పంచవేదములుఁ జతుర్దశ భువనములుఁ ద్రిమూర్తులు నిన్ను రక్షింపఁ బ్రయత్నింపఁ జూతురుగాక! నిన్ను మడియింతును—మడియింతును— మడియింతును. మడియింపనినాఁడు నా పేరు విశ్వామిత్రుఁడే కాదు. నీ యవిధేయతకు నా ప్రతిజ్ఞయే ప్రతిఫలము.

సీ॥ నీ వధిష్టించెడి । నిఖిల రత్నాంచిత
సింహాసనంబూరుఁ । జెందఁజేసి
నీ భార్యమెడనుండు । శోభాయమానమౌ
మంగళ సూత్రమున్ । మట్టిఁగలిపి
నీవు ముప్పొద్దుల । నిండారుముద్దుగాఁ
బెంచిన కుఱ్ఱ నే । డ్పింపఁజూచి
నీవుగడించిన । నిస్తుల కీర్తికి
మాఱుగా దుర్యశో । భార మొసఁగి
గీ॥ యమపురంబున బాతకా । పయిన నిన్నుఁ
దెలుపుమందు విశ్వామిత్రు । దివ్యశక్తి
యెట్టిదో తెల్పుమందు, నీ । వింకఁజావు
కొఱకు వేచియుండుము నీచ । గుణయుతుండ!

(అని దండకమండలాదులంగొని నిష్క్రమించును.)

యయా—హా! రామచంద్రా! (మూర్ఛిల్లును)

నార—(తనలో) బీజము మొలకెత్తినది. ఇంక దీనిని పెంచి పెద్దఁజేయు విధమారయవలయును. (ప్రకా) మునీంద్రులారా! చివికి చివికి గాలివానయయినది. ఈమహారాజు మూర్ఛమునింగినాఁడు. వీనికిఁదగిన శైత్యోపచారము లొనరింపుఁడు. గతించినదానిని గూర్చి వగవకుఁడు. కర్తవ్యమాలోచింపుఁడు. ఇంక నే నరుగుచున్నాఁడను.

భర } నారదా! ఏసమయమున కేదివచ్చునో యెఱుంగముకదా! మంచిది.
వసి } నీ వరుగుము. ముందుగా నీతని మూర్ఛనుండి తేర్పవలయును.

నార—(ముందునకువచ్చి) ఇపుడు నేను విశ్వామిత్రునాశ్రమమున కరిగి వానికిఁ గర్తవ్యముపదేశింపవలయును. (నిష్క్రమించును.)

తెర పడును.

---

నాలుగవ రంగము—విశ్వామిత్రునాశ్రమము.

[ప్రవేశము—విశ్వామిత్రుడు]

విశ్వా—(శరీరతాపమభినయించుచు) అబ్బా! ఏమి యీబాధ? ఏమి యీయయా వేదనము? వేయితేళ్లొక్కతూరి మేనిపైఁబడి కుట్టుచున్నట్లున్నది. నాహృదయము నెవ్వరో చేయిపెట్టి కలంచుచున్నట్లున్నది. భయంకరాగ్నిజ్వాలాగుండమున నన్నుఁగూలఁద్రోసినట్లున్నది. ఇంతటిదారుణ నితాంతసంతాపమునకు హేతు వేమి? ఆఁ, హేతువా? అవమానము-దుర్భరావమానము-దుస్సహదురంత చింతాసంకలిత పరాభవము. అదియు నెక్కడ? మదీయాజన్మశాత్రవుండగు వృద్ధవసిష్ఠుని కట్టెదుట. (పండ్లు పటపటఁగొఱికి) ఔరా! కళంకీభూతచిత్తా! దుర్వార గర్వోన్మత్తా! యయాతీ! ఎంతయపచార మొనరించితివిరా! శత్రుధనుర్విముక్త నిశితసాయక సందోహసంజనిత బాధోద్రేక

మయిన నోర్వఁగలనుగాని, నీచేనయిన పరాభవము నోర్వఁజాలను గదా! ఎవ్వాని యాభీలనామమాత్రాకర్ణనంబుచేఁ జతుర్దశ భువనంబులందుండు స్థావరజంగమాదులు సహితము ప్రకంపించునో, ఎవ్వాని మహోగ్ర తపోదీక్షోద్భవదుర్భరశిఖిశిఖామాలికలకుఁ బ్రమథగణపరివృతుండగు ఫాలాక్షుఁడు వెండికొండతోఁగూడఁ గరఁగి ప్రసన్నతాజలస్వరూపమునఁ బ్రవహించునో, ఎవ్వానియాజ్ఞను గ్రీష్మకాల మధ్యందిన విద్యోతఖద్యోతన ప్రముఖులచంచలభక్తితో మాలిందాల్తురో అట్టి విశ్వామిత్రుఁడు-నిర్జితాఖిల గర్వోన్మత్త శత్రువుండు - నిరస్త సమస్త దోషుండు-త్రింశత్కోటిసుపర్వ వందనీయ దివ్యపాదారవిందుండు - దూరీకృతాఖండలాఖండభూమండలాధిపమండలాయమానభోగభాగ్యోద్దండుండు సుపవిత్రచరిత్రుఁడు-బ్రహ్మర్షిపట్టభద్రుండు, నీకంటికి - బారగమ్మిన్న నీకంటికిఁ, బరిహాసపాత్రుఁడాయెనా! ఈజడదారి మెడలోనున్న రుదురాక పేరు, త్వదీయ కంఠసీమాలంకృతామూల్యమౌక్తికహారంబులోఁ, దులఁదూఁగకపోవచ్చుఁగాక! ఈనిరాబారి గెడ్డమునందుఁగల బలుసువెంట్రుకలు, నీమూర్ధమునఁగల సుందరసుకుమారసువక్రసునీలసుదీర్ఘకేశములంబోలెఁ బరిమళ ప్రదములై, సుగంధద్రవ్య ప్రభాభాసమానములుగాక పోవుగాక! ఈ రాచతపసి కట్టిన కటువయిన నారబట్ట, భవదీయ మృదుల దేహాంచితచీనిచీనాంబరశ్రేణితో వియ్యమందకపోవుఁగాక! ఈ నిఱుపేద యోగి కాపురంబుండు నాకుటిల్లు, నందనోద్యానసదృశహృద్యోద్యానవనమధ్యవిలసితభర్మనిర్మితకుడ్యతేజోవిరాజితసుందర మందిరమునకుఁ దీసికట్టయగుగాక! అంతమాత్రమున నీవీ విశ్వామిత్రుని గేలిసేయుదువా? అతని విరోధులు పకపక నవ్వునట్లుగా పరిభవింతువా? యయాతీ! మదీయారాతీ! వసిష్టపక్షపాతీ! ఏల నీకింత కండకావరము ? ఏమి చూచుకొని నీవిట్లుమిట్టిపడితివి? మహేంద్రవైభవము నిరసించు

వైభవము నీకున్నదందువా? ఉండుఁగాక! ఐశ్వర్యము బుద్బుద ప్రాయముగదా! నీకంటె నైశ్వర్యవంతులగు జగజెట్టుల నెందఱినో కాలిక్రిందమట్టి పెడితినే? లోకసమ్మోహనకరంబగు సౌందర్యాంచితయౌవనాతిశయంబొప్పుచున్నదందువా? ఒప్పుఁగాక! అయ్యది శరత్కాలసంజనితకాదంబినీచంచలాతరలంబుగదా! మునిబృందారక బృందముల యమోఘాశీర్వచనప్రభావంబున దీర్ఘాయువు కలదందువా? కలుగుఁగాక! అయ్యది కరికర్ణాంత విలోలముగదా! కుబేరునికిఁ బెట్టుబడిపెట్టగల లెక్కకు మిక్కిలి యయిన రొక్కము నీబొక్కసమునఁ దనరునందువా? తనరుఁగాక! రాజుల సొమ్ము రాళ్ళపాలన్న సామెత కలదే! ఇఁక నేమి చూచుకొని గర్వించితివి? త్రిమూర్తులను సైతము క్షణములో భయభ్రాంతులం జేయఁగల యాదిట్ట విశ్వామిత్రుఁడేయలిగిననాఁడు-నిన్నురక్షించువారెవ్వరు? నీకభయమిచ్చువారెవ్వరు? నీకు ధైర్యముంజెప్పువారెవ్వరు? లోకబాంధవుండగు సూర్యుఁడే లోకదహనక్రియకుఁ గడంగినపుడు, ఏ జలాశయము లోకమును రక్షింపఁగలదు? కోరి మృత్యుపిశాచినాహ్వానించు కొంటివి. ముంగొంగున ముద్దుగా నింగలమును గట్టుకొంటివి. కొఱవితోఁ దలగోకికొంటివి. గుహలో విశ్రమించుచున్న సింగపుంగొదమను రెచ్చగొట్టితివి. మ్రాగన్నుపడిన పులిపిల్లతోఁకను లాగితివి. ఇఁక నీపాట్లు కుక్కలొల్లవు. షడ్రసోపేత దివ్య పదార్థ ఖాదనమున నేధితంబయిన నీరక్తము మృత్తికలోఁ గలసి కుమ్మరి సారెకెక్కఁ గలదు- బహు శ్రద్ధా పోషితములయిన నీ యస్థులను నక్కలు దనివితీఱఁ గొఱుకగలవు- ఆసమయమున వినఁబడుసద్దును- నే నిందుండియే హాయిగా వినఁగలను- విని సంతృప్తిఁ జెందగలను- సంతృప్తిఁ జెంది భీషణ ప్రతిహింసా ఫలితమిదియని రాజచక్రమునకుఁ జాటఁగలను. నన్ను నీవు పరిభవించినపుడు లోలోన బాగు బాగు, కానిమ్మన్న వసిష్ఠుఁడపుడు నీవోగుసకుబోరున నేడ్వకమానఁడు

నాదీనావస్థకుఁ బకపకనవ్విన భరద్వాజుఁడు నాశాపము వలన నీభార్యకుఁగలుగఁబోవు వైధవ్యసంతాపమునకు వికవిక లాడకపోవఁడు. కనుక నించుకంతకాలము తాళుము. (తెరలో శ్రీహరినామ సంకీర్తనము - అనుబంధము 2. ఆలకించుట యభినయించి) శ్రీమన్నారాయణ నామసంకీర్తనము వినఁబడు చున్నది. ఆ వచ్చునాతఁడు నారదముని కాఁబోలు! ఆహా! ఈతని యనూన దివ్యగానామృతాస్వాదనమున క్షణములోఁ జిత్తమునకించుక ప్రశాంతిగలుగు చున్నది.

గీ॥ సుదతి జవ్వని కేఁగంటి । చూడ్కి-కంటె
గానమేలాగు ముందుగా । మానసమును,
కాంతమునకైన నినుము నా । కర్షణంబు
సేయుటందంత శక్తియుఁ । జేనలేదు.

[ప్రవేశము—నారదుఁడు.]

విశ్వా—నారదమునిచంద్రమా! విచ్చేయుము. మంచిసమయమునకే వచ్చితివి.

నార—విశ్వామిత్ర మునిపుంగవా! దీర్ఘాలోచనాసముద్రమున మునింగియున్నట్లు నీముఖలక్షణములు చెప్పుచున్నవి. ఏమందువు?

విశ్వా—అగును. ఆ యయాతియవినయమును నీవును గన్నులారఁ గాంచితివిగదా! ఆహీనునిచేఁగలిగిన పరిభవాగ్ని హృదయస్థ మందలి శాంతిజలము నింకించినది.

నార—అయిన నిపుడుకర్తవ్యమేమి?

విశ్వా—కర్తవ్యమునకేమున్నది. ఆ తుచ్ఛుఁడు మరణింప వలయును?

నార—(నవ్వుచు) విశ్వామిత్రా! అది యంత సామాన్యకార్యముగా నీకుఁదోఁచుచున్నదా?

విశ్వా—[రిచ్చపాటభినయించుచు] సామాన్యముగాక, దుర్ఘటమా? మునిశేఖరుండవయ్యుఁ బామరునివలె భాషించుచున్నాఁడవేమి? తపశ్శక్తిసంపన్నుల కసాధ్యమున్నదా!

సీ॥ గంపమ్మైఁ గొండలఁ । బిండిచేయు మహేంద్రు
మేన యోనులను గ । ల్పించెనెద్ది?
సప్తసాగరమహా । జలములఁ ద్రుటిలోన
జానెడుపొట్టలో । దాచెనెద్ది?
ప్రబలాంధకార దు । ర్భరబాధఁ దోపించి
గ్రహరాజుగతి నరి । కట్టెనెద్ది?
ఆత్మరక్షణకయి । హరునంతవానిని
వాడవాడలకేఁగఁ । బనిచెనెద్ది?
గీ॥ అతులవింధ్యాద్రి గర్వంబు । నడచెనెద్ది?
చొచ్చి యఱగాలిఁ గన్నును । జూపెనెద్ది?
అట్టి దివ్యతపశ్శక్తి । కవనియందు?
గలదె దుష్కరంబొండు త్రి । కాల విదుఁడ?

నార—విశ్వామిత్రా! నీనుడియథార్థమే కావచ్చును. కాని-

గీ॥ చండతరభండన స్థలి । శాత్రవులను
దఱిసి చెండాడు శితఖడ్గ । ధార, వంట
లక్క వండెడిపులుసులో । ముక్కలకయి
పుచ్చకాయను గోయునే । పుణికిఁదగునె?

ఉత్తమవంశ సంజాతయగు స్త్రీయొక్క సాహసము స్వీయ పతివ్రతా ప్రదర్శనమునకుఁగాని, అమవసనిసిని భర్త నిద్రించు సమయమున మాఱుమగనికొఱకుఁ బ్రాకులాడి గోడలుదూకుటకుఁగాదు. ధీరోదాత్తుని ధైర్యము ఆపన్నులగు వారిని విపత్సముద్రమునుండి తరింపఁజేయుటకుఁగాని, మూలఁగూర్చుండు ముసలిముండను గాటికిఁబంపుటకుఁగాదు. అవక్రపరాక్రమోపేతుండగు సుక్షత్రియ వీరుని శౌర్యము, ప్రజలయర్థప్రాణ సంరక్షణకార్యభార ధురంధరత్వమునకుఁగాని, సాధుజనులను హింసించుటకుఁగాదు. అష్టైశ్వర్యసంపన్నుని ధనము పాత్రులగు నసహాయయాచకుల కుక్షింభరత్వమునకుఁగాని, తా మూగు

బంగారు టూయలలకుఁగాదు. ఉద్యోగుల యధికారము గర్వాంధుల గర్వనిర్వాపణమునకుఁగాని, వీలు పేదలను బెదరించి లంచములు సంగ్రహించుటకుఁగాదు. కవికుమారుని మహిత మంజుల మధురకవిత్వ భాస్కరోదయము త్రిలోక పరీతాజ్ఞాన గాఢజీమూతవిచ్ఛిన్నమునకుఁగాని, యుబ్బలింగళ్ల పజ్జంజేరి భట్టుగామాఱి స్వోదరమాత్రపూరణము కొఱకుఁగాదు. విలయకాల పర్జన్యగర్జానుకారియగు సింహగర్జనము పర్వత గహ్వరాంతర్భాగ నిద్రాముద్రిత మహోన్నత వేదండ తండ గండభాగ విభేదక్రియాదక్షతకుఁగాని, గాదెక్రింది ఒక్కచిక్కిన పందికొక్కుఢొక్కల ప్రక్కలించుటకుఁ గాదు. అటులనే మహర్షులఁ తపశ్శక్తి ప్రజామోదమునకుఁగాని, ప్రజాఖేదమునకుఁగాదు. గాధేయా! నీ వెఱుంగని విషయములేవున్నవి? నీకు ధర్మోపదేశ మొనరింపఁగల సమర్థుఁడెవ్వఁడు?

విశ్వా—(తెల్లఁబోయి) నారదా! ఇదేమియింతవైఖరి నవలంబించుచున్నాఁడవే? ఆనాఁడు నాహృదయమున నీవిషయమైయీర్ష్యా బీజమును నాఁటినది నీవేకదా! ఇప్పుడీ యుపన్యాసమేమి?

నార—(నవ్వుచు) కౌశికమహర్షి చంద్రమా! ఆంతరంగికముగా నన్న మాటకంత గందరగోళము బెంచితివి. నిర్హేతుకముగా నిష్కపట స్వభావుండు-నిస్తులయశఃప్రపూర్ణుండు- నిరంతర హరినామ సంకీర్తన పరాయణుండునగు యయాతిని జంపఁ బ్రతినఁబూనుమని నిన్ను నేను బ్రోత్సహించితినా?

విశ్వా—ఏమీ? ఆతనిఁజంపఁ బ్రతినఁబూనుట నిర్హేతుకమా! ఆతడొనరించిన పరాభవము నీకును సమ్మతమయ్యెనా?

నార—(నవ్వుచు) నిర్హేతుకమో, సహేతుకమో, ఇప్పుడావాద మేల? ఇపుడు నీకర్తవ్యమును దెలుపుము.

విశ్వా—అది యీవఱకే చెప్పితిని. దానిని బ్రహ్మాదులు మార్పలేరు.

నార—యయాతి బలవన్మరణమే నీసంకల్పమా?

విశ్వా—ఆ. ముమ్మాటికి.

నార—అటులయిన నీకుఁదీఅని యపఖ్యాతి వాటిల్లదా! భక్తాగ్రేసరు నొకని౯జంపినందులకు భక్తవత్సలుఁడు నిన్ను నిందింపఁడా? బృందారక బృందము నీచేత గర్హింపదా? మునులు నిన్నుఁ బాషాణ హృదయుఁడనరా?

విశ్వా—నారదా! నాకీ పిరికిమందు పనిచేయదు- నేను లోకాభిప్రాయము లెక్క సేయని కఠినుడను. ముల్లోకములు తల్లడిల్లినను, నాకు నితాంతాపఖ్యాతి వాటిల్లినను, నాసంకల్ప మీడేఱవలయును.

నార—(ఆలోచన మభినయించి) అటులయిన యయాతి మరణమే నీ దృఢసంకల్పము?

విశ్వా—ఆఁ. అగును. ఆమాట యీవరకే చెప్పితిని. ఇంకెన్నిసార్లు వాగింతువు?

నార—నిన్ను సిద్ధసంకల్పునిఁ జేయుమందువా? నీకు హింసాపాపమంతఁగాఁ దగులకుండఁ గార్యమీడేఱు విరవుఁ జెప్పుమందువా?

విశ్వా—(సంతోషముతో) ఇఁకఁ గావలసిన దేమున్నది? కోడలు కొడుకుంగనెదననఁగా నత్తగారెందయిన వద్దనునా? ఏమార్గమయిన నాకేమి? పగతీఱుటయే నావాంఛ.

నార—అటులయిన నీకుఁ బ్రియశిష్యుండగు శ్రీరామచంద్రునికడకు ముందుగా నరుగుము.

విశ్వా—అరిగిన పిమ్మట?

నార—పేరు వాకొనకుండఁ బరాభవ సంతాపమును వెలిబుచ్చుము.

విశ్వా—తదుపరి?

నార—నీమాట నాతఁడు గాదనఁడు. నీకు బరిభవక్లేశము గల్పించిన వానిని జంపితీరెదనని ప్రతిజ్ఞ చేయఁగలఁడు. ఇదిగో! యయాతి శ్రీరామభక్తుడనిఁ నీవు సందేహింపకుము. సద్గుణసాంద్రుడగు రామచంద్రునకు గురుఁడే దైవము. కనుక నీయాజ్ఞం బాలించి యయాతింగడఁదేర్చి నీకుఁ బ్రతిజ్ఞాపాలనప్రాప్తి

ఘటించును- ఇట్లు కావించి కృతార్థుడవుగమ్ము- ఇకనే బోవుచున్నాడను.

విశ్వా—(సంతోషముతో) నారదా! మంచియుపాయమే చెప్పితివి. నేనుగూడ నిప్పుడే పయనమై యయోధ్యం జేరెద. నీవరుగుము.

నార—(అనుబంధము తే-నిష్క్రమించును)

తెర పడును.

ప్రథమాంకము సంపూర్ణము.



ఓమ్.
శ్రీ రామా!

# హనుమద్రామ సంగ్రామము

## ద్వితీయాంకము

---

మొదటిరంగము—అయోధ్యయందలి రాజభవనము.
(సీతారాము లుపవిష్టులైయుండఁగాఁ దెర లేచును.)

సీత—ప్రాణేశ్వరా! ఈమధ్య వాయుపుత్త్రుని క్షేమవార్తలేవయినఁ దెలియుచున్నవా?

రాము—ప్రేయసీ! ఆ మహాత్ముని క్షేమమునకుఁగొదువయుండునా! కష్టసుఖములు సంసారపాశబంధితులగు వారికి ఖేదమోదము లంగూర్చునుగాని, జితేంద్రియులగు బ్రహ్మచారుల యెడఁలఁ బనికిరావుగదా! హనుమంతునిఁబోలినపూజ్యులు - ఈలోకప్రవృత్తులయెడ నీటిమీఁది తామరాకు వలెనుందురు.

సీత—ఆర్యపుత్రా! ఆంజనేయునిఁగన్నతల్లి ధన్యచరిత్ర. మోహిజ్జన దీపిక. స్త్రీలోకమాపూతగాత్రి పదపల్లవంబులకుఁ బ్రణామిల్లవలయును. అట్టిగుణరత్నాకరుని బ్రసవించుభాగ్యము సామాన్య కాంతలకుఁగలుగదుగదా! వేయిజిహ్వాలున్న యాదిశేషుండ యిన మారుతియొక్క గుణగణాభి వర్ణనమునకు సమర్థుదు కాఁడనుటనిక్కము.

రాము—అగునగును. భూపుత్త్రి! ఆ పవనతనూభవుని సాహాయ్యము వలననేకదా మరల మనమిప్పుడిట్లు కలసుకొని సుఖింపఁగలుగు చున్నారము! అతఁడు మనకుఁగావించిన యుపకృతుల నెవరు లెక్కింపఁగలరు

సీ॥ పాతాళలోక దు । ష్ప్రాప్తిని గల్పించి
మైరావణుఁడు మమ్ము । బట్టునపుడు
వికటాట్టహాస దు । ర్భేద్యాయుధాళిచే
సోఁకుమూఁకలు నిన్నుఁ । జుట్టునపుడు
సంగ రాంగణముక్త । శాత్రవ శక్తిచే
మును లక్ష్మణుఁడు మూర్ఛ । మునుఁగునపుడు
కుటిలరాక్షస కూట । చటులమాయాజాల
గాఢాంధకారమ్ముఁ । గ్రమ్మునపుడు

గీ॥ తరుణి! యాతని సాయంబె । కొఱఁతవడిన
నిలుచఁగల్గుదుమా యొక్క । నిముసమయిన?
పూతరఘువంశమును నిల్పె । బూజ్యగుణుఁడు!
ప్రాణములనిచ్చి రక్షించె । రమ్యకీర్తి!

కనుకనే, సర్వదా, నామనమాతనితోడి శత్రుత్వమునే కాంక్షించు చుందును.

సీత—(తెల్లబోయి) అమంగళము ప్రతిహతమగుఁగాక! నాథా! ఎన్నఁడు లేనిమాటనంటిరే? అతనితోడి శత్రుత్వమునా మీరు కాంక్షించుట?

రాము—(నవ్వుచు) జానకీ! పొరబడితిని. మిత్రత్వ మనఁ బోయి యట్టులంటిని. దానిని దప్పుగాఁ బాటింపకుము.

[ప్రవేశము—సేవకుఁడు]

సేవ—జయము జయము మహారాజుగారికి (వంగి నమస్కరించును)

రాము—సేవకా! ఏలవచ్చితివి?

సేవ—ప్రభూ! విశ్వామిత్ర మహర్షిచంద్రులు దేవరవారి దర్శనార్థము విచ్చేసియున్నారు.

రాము—లోనికిఁబంపుము.

సేవ—చిత్తము. [నిష్క్రమించును]

రాము—జానకీ! గురుదేవుఁడెందులకో యేతెంచెనట. నేను అతనితో ముచ్చటింతును. నివు లోనికరుగుము.

సీత—మహాభాగ్యము [నిష్క్రమించును.]

[ప్రవేశము—విశ్వామిత్రుఁడు]

రాము—[ఆసనమునుండి లేచి నిలువఁబడి యంజలిఘటించి] దేవా! భవదీయ ప్రియశిష్యుఁడు శ్రీరామచంద్రుఁడిదే నమస్కరించుచున్నాఁడు.

విశ్వా—ఆయురారోగ్యభోగభాగ్యాభి వృద్ధిరస్తు!

రాము—మహాత్మా! ఆయాసన మలంకరింపుఁడు.

విశ్వా—[ఆసనమున నుపవిష్టుఁడగును] రామభద్రా! నీవును గూరుచుండుము.

రాము—(అట్లుచేసి) ఆచార్యా! తమకుఁగుశలమే కదా!

విశ్వా—రామచంద్రా! ఒకానొకహీనుఁడు-మానవాధముఁడు-స్వపరబలవిజ్ఞాన రహితుఁడు - నన్ను బడుగు జడదారిగాఁదలఁచి, నా శక్తిని నిరసించి, నన్నుఁబరిభవించినపుడు - ఏతత్పరిభవమునకు మదీయాజన్మ విరోధికూటము బాగుబాగని మెచ్చి, తల లూచి యుప్పొంగినపుడు - నాకుఁగుశలమెక్కడ?

రాము—(ఆశ్చర్యక్రోధములతో) ఆఁ ఆఁ ఏమనుచుంటిరి? అనివార్యశక్తిసంపన్నులు - అఖండతపోధనులు - అసదృశతేజోరాజితులునగు మిమ్ములనెవ్వఁడో యొక్క క్షుద్రుఁడు పరాభవించెననియా? ఎవ్వఁడాగర్వాంధుఁడు? చెప్పుఁడు. చెప్పుఁడు. ఆలస్యమును మదీయచిత్తమోర్వకున్నది. క్షణములోవానిని యమపురంబునకుంబంపెద.

విశ్వా—రఘుకులాబ్ధిచంద్రా! జన్మప్రదాతలగు జననీజనకుల కంటె, జ్ఞానభిక్షాప్రదాతయగు గురుఁడధికుఁడని నీవెఱుంగుదువు. నేను నీకస్త్రశస్త్రప్రయోగ... సంహారములను నేర్పినగురుం

డను. నావాక్యము నీకు వేదవాక్యము. అదియెట్టిదయినను నీకాదరణీయమేయగును. కనుక -

రాము—(అర్థోక్తిలోనే) మహాత్మా! ఇంతయేల! దేవరకుఁబరాభవ మొదవెననఁగా నాకొదవినట్లు నేను భావించుచున్నాడను. ఇదిగో నాశపథ మాలకింపుడు. చతుర్దశ భువనములు తల క్రిందులయినను, బారావారము లింకిపోయినను, గ్రహములు గతులందప్పినను, కులమహీధర కూటము పిండియయినను, భూమ్యాకాశము లేకమయినను, అష్టదిక్పాలురు, బహ్మాదులు యుద్ధమునకు సిద్ధపడినను దమయెడల నపచారము గావించిన యాదుష్టచిత్తుని - అగర్వాంధకార ప్రమత్త హృదయుని - సంహరించి తీరెదను. నిర్వక్రపరాక్రమో పేతుండగు చక్రి చక్రమురిత్తపోవుఁగాక! జగజ్జేగీయమాన ప్రతాపోద్దీపితుండగు వజ్రివజ్రము భిన్నమై చనుగాక! త్రిపురాంతకుని శూలము మొక్కవోవుఁగాక! అఖండ ఖండన పాండిత్య ప్రకర్షోద్దండ యశోమండితంబును, వైరివేదండ మహాతండ శిక్షాదక్ష సూక్ష్మవీక్షణాంచిత హర్యక్షంబును నగు నాకోదండము, చండకౌశిక బిరుదాంకితులగు మిమ్ముఁబరిహసించినవాని ప్రాణములను హరింపకమానదు. అనీచుని నామముం జెప్పుఁడు.

విశ్వా—రాజశేఖరా! నీవాక్కులు నిక్కములా?

రాము—దేవా! ఇదేమి? నన్నుఁగూడ మీరు సందేహించుచున్నారా? రఘువంశ సంజనితుల నోటఁబొల్లు మాటలు వెలువడునా? వారి స్వభావము మీరెఱుంగనిదా?

సీ॥ భద్రస్య హర్మ్య నివాస । భాగ్యంబు వర్జించి
పటకుటీరంబులఁ । బట్టుటయును
చీనిచీనాంబర । శ్రేణిని విడనాడి
కటువైన నారలు । గట్టుటయును
షడ్రసోపేత భ । క్ష్యంబులఁబోనాడి
కందదుంపలఁబొద్దు । గడుపుటయును

పరిమళించుచుఁ బూఁ। బాన్పులఁ ద్యజియించి
బండపై నెమ్మేను। వాల్చుటయును
గీ॥ సత్యవాక్పాలనమునకై । పాపాసించి
నిన్న మొన్నటిదాఁక నే । నున్న తెన్నుఁ
జాటుకష్టములేకదా । సంయమీంద్ర!
మరచితిరా వీని నింతలో । మానసమున?

విశ్వా—రామభద్రా! నీవు పలికిబొంకనివాఁడ వేయగుదువు. కేవలము సత్యవాక్పాలనముకొఱకే పదునాలుగేండ్లు కానలఁగడగండ్లఁ గుందితివి. కాదనియెవ్వరందురు? కాని......(సందేహమభినయించును.)

రాము—మహాత్మా! సందేహమేల? మిమ్ముఁ బరాభవించిన యాతఁడు మదకు ।నాకుఁ బ్రాణమిత్రుఁడయినను, లేక బాంధవుడయినను, గాక నాకత్యంతభక్తుండయినను, నేనుసహింపను. వానిని జంపితీఱెదను. వానిరక్తవృష్టిచేఁ దమ్ముఁబాదించుచున్న పరిభవాగ్నిజ్వాలలను జల్లార్చెదను.

విశ్వా—రామచంద్రా! వాఁడెవ్వఁడో కాదు. చెప్పమందువా?

రాము—ఆ. చెప్పుఁడు. సందేహమేల?

విశ్వా—వాఁడు సూర్యవంశ సంజాతుఁడగు క్షత్రియవీరుఁడేసుమీ.

రాము—అగుఁగాక! చంద్రుని అమృతమును బ్రభవింపఁజేసిన పాల్కడలియే భయంకర కాలకూటవిషంబును, బడబాగ్నినిగూడఁ బుట్టువొందఁజేసినది. గుణమునకుఁ గులము ప్రధానముగాదు.

విశ్వా—వాఁడు యయాతి.

రాము—(ఆశ్చర్యముతో) ఆఁ, ఎవ్వరు? ఎవ్వరు?

విశ్వా—యయాతి—

రాము—(తెల్లబోయి) మహాత్మా! యయాతిమహారాజా? నిత్యసత్యవ్రతుండు-నిరంతర హరినామసంకీర్తనపరాయణుండు-విస్తారయశోవిశాలుండు నగు యయాతి నృపాలుఁడా?

విశ్వా—అగును. ఆ రాజకులాధముఁడే.

రాము—(చెవులు మూసికొని) హా! శ్రీహరీ! (కొంచెమాగి) మహాత్మా! ఇది నిజమా?

విశ్వా—నిజముగాక పరిహాసమనుకొంటివా? నీతోఁ బరిహాసోక్తులు పలుకుటకు నేను వచ్చితినా?

రాము—(కొంచెమాగి) ఆర్యా! అతఁడెట్లు మిమ్ముఁ బరిభవించినాఁడు? ముందుగాఁ బరిభవవిధానమెట్టిదో చెప్పకుంటిరిగదా!

విశ్వా—భరద్వాజు నాశ్రమమునందు భరద్వాజుఁడు, వసిష్ఠుఁడు, నారదుఁడు, నేనును సుఖాసీనులమై యుండఁగా వాఁడువచ్చి ముమ్మందు వృద్ధవసిష్ఠునికి మ్రొక్కినాఁడు. ఆపిమ్మట భరద్వాజునికిఁ బ్రణామిల్లినాఁడు. ఆ తమపవ నారదునికి నమస్కరించినాఁడు. కడపట నన్నుఁజూచి సాష్టాంగపూర్వకముగా వందనమాచరింపఁబోయినాఁడు. నేను క్రోధాతిరేకముతో నెడమకాలితో వాసిందన్నితిని. నాకొనరించిన పరాభవమునకు వానిని జంపుదునని ప్రతిజ్ఞపట్టితిని.

రాము—(చెవులు మూసికొని) శ్రీహరీ!......(కొంచెమాగి) దేవా! పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్ర ప్రయోగమా? యయాతి భూపాలుఁడు రాజచక్రంబునందెల్లఁ బేరెన్నికఁ గన్నవాఁడు. అతఁడు తొలుతే వసిష్ఠమునీంద్రులం జూచియుండనోపు. కేవలము ముందుగా మీకు నమస్కరింపలేదన్న నేరమునకై యా పూజ్యుని వధ్యునిగా నిశ్చయించితిరా? హరిహరీ! ఎంతకష్టమెంతకష్టము!

విశ్వా—(ఇంచుక కోపముతో) ఏమి? రామభద్రా! నీగురునిఁ బరిభవించిన పరమదుర్మార్గుడు నీకుఁ బూజ్యుడాయెనా? కులాభిమానము విడువలేకున్నాడవా?

రాము—ఆర్యా! కులాభిమానముకాదు-గుణాభిమానము-ఏమందురా?

సీ॥ బృందారక బృంద । సందోహ సంస్తుతుల్
సలుపువాఁడు; యశంబు । నిలుపువాఁడు

విద్వేషి రాజన్య । విపిన దావాగ్నియై
        యేర్చువాఁడు; ధనంబు । గూర్చువాఁడు
దీనజనావన । దీక్షాతి దక్షుఁడై
        ప్రోచువాఁడార్తులఁ । గాచువాఁడు
శ్రీకాంతుపాద సం । సేవాభిలాషియై
        చేయువాఁడాశను । బాయువాఁడు
గీ॥ క్రతువులన్నని జరపి, వి । ఖ్యాతమునుల
పీడలను దూల్చి, ప్రజలను । బిడ్డలట్లు
లెంచువాఁడు-సుఖముగఁ బా । లించువాఁడు
ఆ యయాతిపై మీఁగలి । ట్లలుగఁదగునె?

విశ్వా—(కోపముతో) రామచంద్రా! చాలుఁజాలు నూఱకొనుము. ఆయయాతి నీకు బంధుగుఁడయిన, నాసమ్ముఖంబునఁగాక, వేఱొక్కతావున వానిగుణగణములను వర్ణింపుము. వానిని జంపుటకు నాయొద్దశక్తి లేక, నీకడకువచ్చియుండలేదు. ఈ విశ్వామిత్రుండు ప్రచండకోపుండయిన నట్టి యయాతియు, గియాతియుఁ గాక, ముల్లోకములుఁ దల్లడిల్లవలసినదే!

రాము—(అర్థోక్తిలోనే) మహాత్మా! తమప్రభావము నేనెఱుంగనిదే! ముల్లోకములేకాక, పదునాల్గు భువనములును దమ నామమాత్రకర్ణనముచేతఁ బ్రకంపించుచుండును. (పాదములపై వ్రాలి) ఇదిగో- ఈరాముఁడు- తమప్రియ శిష్యుఁడు- దీనాతిదీనుఁడై ప్రార్థించున్నాఁడు. మన్నింపుఁడు. నిర్దోషియగు యయాతిమహారాజును రక్షింపుఁడు. భక్తాగ్రేసరుండగు నాభూపతిభక్తి ప్రవృత్తినయినఁబ్రశంసించి.........

విశ్వా—(లేచి ప్రక్కకుదలంగి) చాలు. రామా! చాలు. ఇఁకనే బోవుచున్నాఁడను. యయాతినిర్దోషియా! నన్నుఁబరిభవించుట దోషము కాదుకాఁబోలు! (తలపంకించి) కానిమ్ము. నీ గురుభక్తి యెట్టిదో పరీక్షింపఁగోరివచ్చితినిగాని, యయాతి ప్రాణహరణము దుస్సాధ్యమనికాదు. హా!......రామచంద్రా!

నీవు తొల్లింటి రామచంద్రుఁడవుగావు......నీనైజమిప్పుడు మారిపోయినది-రాఘవరాముఁ డనఁగా మూర్తీభవించిన కృతజ్ఞతయనియే నేనింతవఱకు భ్రమించితిని. కాని కృతఘ్నుఁ డని తెలిసికొనలేకపోయితిని.

రాము—(హఠాత్తుగాలేచి దిచ్చపాటుతో) హా! ఏమనుచున్నారు? ఈ రాముడు కృతఘ్నుఁడనియా?

విశ్వా—అగును-చట్రాతిని నాతిగాఁజేయుశక్తిని నీకు గలిగించినదెవరు? లోకకంటకులగు దుష్టదానవనిరకంబులం గూర్చుటకు దివ్యాస్త్ర శస్త్రసంచయంబు నీకుఁ బ్రసాదించినదెవరు? భూపుత్రీ పాణిగ్రహణమునకు హేతుభూతు లెవ్వరు? ఆశాంతవ్యాప్తయశశ్చంద్రిక లెవరివలన నతిశయించినవి? ఇన్ని మహోపకారము లొనరించిన గురునిమాట గడ్డిపోచగాఁ జూచుటకంటెఁ గృతఘ్నత యున్నదా?

రాము—(గురునిపాదములపైఁబడి) స్వామీ! శాంతింపుఁడు. శాంతింపుఁడు. ఈతెపోటులంబోలిన మాటలచే మృదుల హృదయమును నొప్పింపకుఁడు. మీయభీష్ట మీడేర్తును.

సీ॥ నిర్దోషియగువాలి । నిర్హేతుకంబుగాఁ
    జంపెరాముండని । జనములనిన,
అఖిల లోకవ్యాప్త । మా యశశ్చంద్రిక
    యపకీర్తి మేఘాళి । నడఁగిచనిన,
వంశాభిమానంబు । పాటింపలేదని
    బందుగుల్ నన్నింకఁ, బాసిమనిన,
పరిపూతమగు కర । ద్వయమున, ఘోరపా
    తక పిశాచంబులు । తాండవిలిన

గీ॥ సైపనోపుదుఁగాని మీ । చండకోప
వహ్ని నోర్వంగఁజాలను । మౌనిచంద్ర!
చంపుదును నే యయాతిని । జగముతెల్ల
నేకమైనను వాని ర । క్షింపలేవు.

విశ్వా—(సంతోషముతో) సెబాస్! సెబాస్! రామచంద్రా! నీసత్య వాక్పాలనాతత్పరత ప్రశంసార్హముగదా! ఇఁకనేనరుగుచున్నాఁడను. త్వరలోనే యాదుష్టుని మరణవార్త నావీనులకు విందుఁగొలుపవలయును.

రాము—చిత్తము.

[విశ్వామిత్రుఁడు నిష్క్రమించును.]

రాము—(కన్నులనుండి నీరు కార్చుచు) అక్కటా! తొందరపాటు సర్వానర్థములకు మూలముగదా! యుక్తాయుక్త విచక్షణజ్ఞాన శూన్యుండనై భూపాలపుంగవుఁడగు యయాతినిఁజంపఁబ్రతినఁ బట్టితిని. సద్గుణ సంపన్నుఁడగు నాయొడయని మరణము మూమక సద్యశోవల్లరి యెడఁగుఠారముగదా!...... ఇంతకు నామహాత్మునియందు దోషమేమున్నది?......హా! విశ్వామిత్రమునికంఠీరవా! నీవు బ్రహ్మవిద్యాధురంధరుఁడ వయ్యు, రాచకొలమునఁ బుట్టినదిట్టవగుటచే నహంకారమూల ప్రచండ కోపమును పరిత్యజింపలేక, నిర్హేతుకముగా, నిరపరాధిని నా చేతఁ జంపింప సంకల్పించితివిగదా!......అయ్యయ్యో! దుర్భరము. దుర్భరము. భక్తాగ్రగణ్యుఁడగు యయాతినృపతిం జంపి, నాకీర్తికిఁ గళంకమంటఁ గట్టఁజాలను......ఓ కళంకపిశాచమా! నన్నావహించు వెరవాలోచించు చున్నదానవా! ఆ పని నీకు సాధ్యముగాదు. పొమ్ము. దూరముగ పొమ్ము...... హా! యయాతీ! నీ సద్గుణసంపద నెవరు పొగడఁగలరు? నీ నిరంతర ధర్మపరాయణత్వము మునిజనుల కాదర్శప్రాయము. నీ నిత్యసత్యవ్రతము దిక్పాలురకు గుణపాఠము. నీవదాన్యత యర్థిజనబృందములకు మొంగొంగుబంగారము. నీవాత్సల్యము బంధుజన పారిజాతము. నీవు సూర్యవంశమునకు భూషణమవు. నిన్ను గౌరవించి పూజించుటకు మారుగా నాహస్తము ల ఖండప్రచండ కోదండమునందుకొని, భండనపాండిత్య ప్రకటనమునకుఁ దత్తరపడుచున్నవి. అబ్బా! దారుణము. దారు

ణము. ఇదియంతయు విధివిలాసము......హా! హతవిధీ! నీయధికారమనివార్యము. నీకృత్యములు బహువిచిత్రములు.

సీ॥ ప్రాజ్యసామ్రాజ్యాధి । పతిహరిశ్చంద్రుని
మూఁపుపైఁ గలుకుండ । మోపినావు
అర్థికల్పద్రుమ । మౌ మహీజానిని
నలుని వంటింటను । నిలిపినావు
ఎండకన్నెఱుఁగని । యింద్రునంతటివానిఁ
బరులపంచలఁదాఁగఁ । బంచినావు
సత్యవాక్పాలనా । శక్తి గాంతిఁ జెంచిన
నన్నుఁ ద్రిప్పులఁ బెట్టి । నలచినావు
గీ॥ నామమాత్రావశిష్ట వినాశయుక్త
సృష్టిభాండ నిర్మాణ విశేషదుఃఖ
భరితు బ్రహ్మఁగుమ్మరిగను । మార్చినావు
అకట! నీచేష్ట మముబోంట్ల । కర్థమగునె?

(అంతట భరత లక్ష్మణ శత్రుఘ్నులు ప్రవేశింతురు.)

రాము—(తమ్ములం జూడకయే దుఃఖించుచుండును.)

లక్ష్మ—అగ్రజా! నమస్కారము......(ముఖలక్షణములను బరికించి భరతునితో) ఆ. ఇదేమి? ఈమహానుభావుని మోమున విన్నదనము పొడకట్టుచున్నదే! అయ్యయ్యో! మందస్మితంబగు సుందర వదనారవిందము వాడుటకును, తేజఃపుంజముల వెదజల్లువెడఁదగన్నులనుండి బాష్పకణములురాలి ఆణిముత్యాలవలెఁ జెక్కుటద్దములపైఁ బడి చింధుఁద్రొక్కుటకును హేతువేమి?

భర—(పరికించి) లోకైకవీరుండగు రామభద్రునికి విచారమా?

శత్రు—అక్కటా! ఈపూజ్యుని మనోవ్యధకు నిమిత్తమేదియో కదా!

లక్ష్మ—(పాదములచెంతఁ గూర్చుండి, మెల్లగా) అన్నా! రామభద్రా! ......

రాము—(కన్నులదెఱచి మిన్నకుండును.)

లక్ష్మ—అగ్రజా! ఈమౌనమునకుఁ గారణమేమి? మేరునగధీరులగు
మీ రిట్లు విన్నఁదనముం బొందనేల?

ఉ॥ సంగరరంగమందున ని । శాచరయూథములెన్నొ చేరి, దు
స్సంగతి మాయఁ జేసినను । సారెకు రక్తము కాల్వలౌచు ను
త్తుంగతరంగ రంగయుత । తోయధిచాయను దోఁచినన్ మనో
భంగము జెందలేదుకద । ప్రస్తుత మీస్థితియేల నగ్రజా!

భర—మహాత్మా! తెలియక నీ సోదరులమగు మేము తప్పులం
జేసితిమా? లేక దుఃఖభాజనమగు పూర్వవృత్తాంత మేదయిన
జ్ఞప్తికి వచ్చినదా?

శత్రు—అన్నా! ఏ సామంత నృపాలుండయినను ద్వదీయ శాసనో
ల్లఘనం బొనరించి, మనః క్లేశముం గూర్చెనా? సెలవిండు.
అట్టి మదాంధుఁ డున్నచో, దాహముగొన్న నాకత్తి వాని
కుత్తుకం దెగనఱికి వెచ్చనెత్తురును గుటగుటఁ ద్రాగి సంతృప్తి
చెందగలదు.

రామ—సోదరులారా! ఏమని చెప్పను?......చెప్పుటకు నోరురాకు
న్నది......ఆ విశ్వామిత్రుఁడు......(మిన్నకుండును.)

లక్ష్మ—(అర్థోక్తిలోనే మహాకోపముతో) ఔరా! గాధేయా! నీయందు
గురుభావముంచి, నిన్ను దైవముగాఁబూజించుచున్న రామ
భద్రుని యెడల నపచార మొనరింతువా?

గీ॥ గంతువేసెదె? యాబోతు । అంతువోలె!
శృంగభంగము తప్పదు । క్షితిని, నేనె
గొప్పమొనగాఁడ నని మదిఁ । గులుకవలదు?
తాడిఁదన్నినతలఁదన్ను । వాఁడులేఁడె?

భర—(పటపటపండ్లుగీఁటుచు) ఓరీ! విశ్వామిత్రా! కృతఘ్నా! అ
విశ్వాసభూత సంపాతచిత్తా! రఘుకులాబ్ధి సోముఁడు-సకలసద్గుణ
ధాముఁడునగు శ్రీరాముఁడు నీకెట్టియపకృతిఁ గావించెనని
యిట్లు ప్రవర్తించితివి?

సీ॥ మునిజనావళులెల్ల । నిను నీచుఁడన్నను
భక్తి సేవించు దై । వంబువోలె
నీమాట జవదాట । నేరక, దానినే
మహిత శాస్త్రోక్త ప్ర । మాణమనును
లోకులెల్లరు నిన్ను । లేఁకి వానిని జేసి
గర్హించినంతేఁ దాఁ । గనలుచుండు
నీ హితంబునకయి । నీచెప్పు పనులెల్ల
శంకసుంతయులేక । సలిపినాఁడు
గీ॥ పిన్ననాఁటను గోలె నీ । వన్న నధిక
నమ్రభావముతోడ న । నారతంబు
సంచరించెను; దశరథ । సార్వభౌము
కంటె నీయందు భక్తి । నగ్గలము చేసి
అట్టి మహితాత్మునికి, మదీయాగ్రజునకి మనోవ్యథం గల్పిం
తువా? కానిమ్ము. నీపీచమడంచెదను.
శత్రు—ఔరా! బడుగు జడదారీ! శ్రోత్రియులు బుద్ధిమాంద్య
జనితోన్మాదులన్న సామెతను రూఢిపఱచితివా?
చ॥ వనజ భవాండ భాండములు । వ్రక్కలుసేయు తపోధనుండనే
ననిమది గర్వమా? సరియె; । ఆర్యుల శౌర్యము దీప్తిఁజెందునో,
అనితర సౌఖ్యదాయక ని । యామక తీవ్రతపంబె నెగ్గునో,
కనుఁగొనుమింక; రాఘవుని । కంటిజలంబె దహించుమిమ్మంటమై.
రాము—[వారించుచు] ఆ, ఆ, శ్రుతిమించి రాగమునఁబడుచున్న దే?
ఇదేమి? న్యూనాధికభావ మరయకుండ, సవిస్తరముగ మాట
వినకుండ గురుతిరస్కారమునకుఁ బాల్పడుచున్నారు?

లక్ష్మ
భర
శత్రు } [తలలు వంతురు]

రాము—లక్ష్మణా! త్రిలోకైక ప్రపూజ్యుండగు విశ్వామిత్ర మహర్షిని
దూషింపఁ దొడఁగితివా? భరతా! శాంతిపరైక నిరతుండవగు

నీవయిన మంచిచెడ్డలను యోచింపవలదా! వత్సా! శత్రుఘ్నా! గురుతిరస్కార మహాదోషమెట్టిదో నీ వెఱుంగవు సుమీ!

లక్ష్మ—[అంజలి ఘటించి] మహాత్మా! తమ కానిరాబారి ఖేదముం గల్పించెనని వినుటకు నామనసము సహింపకున్నది. అందు వలన తొందర పడితిని. క్షమింపుఁడు.

రాము—సోదరులారా! గురువాక్యము విషపానమువలెఁ బ్రాణాంతక మగుఁగాక! అయ్యది యవశ్యాదరణీయమే యగును.

భర—ప్రభూ! మున్ముందు మీ కన్నీటిధారకుఁగలఁ కారణ మెఱుం గుటకుఁ జిత్తము తత్తరపడుచున్నది.

రాము—(మరలఁగంట నీరు పెట్టుచు) సోదరులారా! ఏమని చెప్పు గుదు?......విశ్వామిత్ర మహర్షి వలన నిర్హేతుకముగా, నిరప రాధి నొక్కనిఁ జంపఁ గృతనిశ్చయుఁడ నైతిని.

లక్ష్మ—(కోపావేశముతో) ఆర్యా! ఈయకార్యనిర్వాహణమునకు బ్రోత్సహించుట యా నిరాహారికిఁదగియున్నదా?

రాము—వత్సా! సౌమిత్రీ! ఆమాటను మానుము. కౌశికుఁడు మహాత్తరశక్తి యుక్తుఁడు. మునిశేఖరుఁడు. మీదుమిక్కిలి గురుఁడు. గురుల వాక్యములనుగాని, చేఁతలనుగాని విమర్శించు నధికారము శిష్యులకు లేదు.

గీ॥ మహిత దోశ్శక్తియుక్తుఁడౌ । భార్గవుండు
తండ్రిమాట చొప్పునఁ గన్న । తల్లిఁబట్టి
కఱకు గొడ్డంటఁ గుత్తుక । నఱకలేదె?
నిన్నమొన్నటికథ, దాని । నీవువినవె?

శత్రు—అగ్రజా! నిరపరాధనిఁ జంపుమని యామునీశ్వరుఁడెట్లుమిమ్ము గోరెను? ఆ నిరపరాధి యెవ్వఁడు?

రాము—నాయనా! శత్రుఘ్నా! అతఁడెవ్వఁడో కాదు. య...యా...తి మ...హా...రా...జు.

లక్ష్మ—[ఆశ్చర్యముతో] ఆఁ! యయాతి మహారాజా? మహాభక్తు డగు యయాతి మహారాజా?

భర—(ఆశ్చర్య విషాదములతో) అక్కటా! ఇదేమి? అట్టి సుగుణ రత్నాకరుని సంహరించిన యెడల లోకమునందీఅని కళంక మాపాదిల్లదా?

శత్రు—అగ్రజా! స్వప్నమందయిన నితరులకుఁ గీడు సేయని మహాత్ముఁడుగదా యయాతిభూపతి! అట్టివానిపై గాఢపట్టి చలము పట్టనేల?

రాము—తాను భరద్వాజాశ్రమమునందుండఁగా, యయాతి యక్కడకువచ్చి మున్ముందువసిష్ఠునికి నమస్కరించినాఁడఁట. పిమ్మటఁ దనకు మ్రొక్కినాఁడఁట. ముందుగాఁదనకు వందనం బాచరింపక పోవుటను మహాపరాధముగా గురుఁడు భావించినాఁడు.

లక్ష్మ—(చెవులు మూసికొని) శ్రీహరీ!

భర—ఎంతపాప మెంతపాపము!

శత్రు—మునులతోడిపొత్తు కత్తిమీఁది సాముగదా!

లక్ష్మ—అయిన నిపుడు కర్తవ్యమేమి? యయాతి ప్రాణహరణమా? ......కాక......విశ్వామిత్ర.........?

భర—(అర్ధోక్తిలోనే) అగ్రజా! నిరపరాధిని దండించి దుర్యశంబును మూటఁగట్టు కొందురా?

రాము—(గద్గద స్వరముతో) సోదరా! భరతా! నేనేమిచేయుదును? విశ్వామిత్రునికి నేను చేసిన బాసచొప్పున నాతనిఁదప్పక చంపవలయును.

లక్ష్మ—అటులయిన సందేహమేల! నన్నాకార్యమునకు వినియోగింపుఁడు.

భర—గురువాక్యపాలన మవశ్యకర్తవ్యమయిన విచారమేల? యయాతి ప్రాణహరణోద్యోగమును దృటిలో ముగించుకొని వత్తును. నాకనుజ్ఞ దయచేయుఁడు.

శత్రు—రామచంద్రా! నన్నంపుఁడు. క్షణములో విపక్షశిక్షాదీక్షం బూని విజయవార్తతో నేతెంచెదను.

రాము—(ప్రక్కకుఁజూచి) సోదరులారా! నాకులంబున ద్రోహి యొక్కఁడు వెలువడినాఁడని యయాతి మహారాజుతోఁ జెప్పుట కోయన సూర్యుఁడు పశ్చిమంబున కరుగుచున్నవాఁడు. మన మిప్పుడు తొందరపడనేల? రండు. లోనికరుగుదము. కానున్నది కాకమానదు.

[అందఱు నిష్క్రమింతురు]

తెరపడును.

---

రెండవ నగరము—వినువీథి.

[ప్రవేశము—నారదుఁడు]

అనుబంధము 4.

నార—ప్రయత్నమెన్నటికిని వ్యర్థముకాదుగదా! నేను తలపెట్టిన హనుమద్రామ సంగ్రామము చిరకాలములోనే సంఘటిల్లఁ గలదు. యయాతిని సంహరింతునని రఘుకులాబ్ధి సోముండగు రామచంద్రుండు విశ్వామిత్రమహర్షికి మాటయిచ్చినాఁడఁట. ఈసందర్భమున విశ్వామిత్రుఁడు నిమిత్తమాత్రుఁడేయగును. హనుమద్రామసంగ్రామ నాటకమున సూత్రధారుఁడను నేనే. .........ఇప్పుడు కర్తవ్యమేమి? (ఆలోచన మభినయించి) యయాతి మహారాజు నిజనగరముం జేరి, శ్రాంతింబవళ్ళు నితాంత దుఃఖాక్రాంత స్వాంతుఁడై యున్నవాఁడు. నే నిప్పుడాతనియొద్ద కరుగవలయును; ప్రాణభీతిచేఁ బరితపించుచున్న యానరపతికి ఆత్మరక్షణోపాయమెఱిఁగింప వలయును. ఇఁకఁదడయ నేల? శీఘ్రముగఁబోయి తలపెట్టిన కార్యమును సాధించితీరెదఁగాక!

[నిష్క్రమించును.]

తెరపడును.

ద్వితీయాంకము సంపూర్ణము

—:0:—

ఓమ్.

శ్రీ రామా!

# హనుమద్రామ సంగ్రామము

## తృతీయాంకము

మొదటి రంగము—రాజమందిరము.

[ప్రవేశము—విచారగ్రస్తుడగు యయాతి]

యయా—[గద్గదస్వరముతో] అయ్యయ్యో! ఇఁకేమి కూర్చుండలేక యెట్టి దారుణవిపత్సముద్రమున మునిఁగిపోయినాఁడను. సప్తవ్యసనములలో నొక్కటియగు వేఁటకు నే నందులకుఁ బోవలయును? పోయినవాఁడను దిన్నగా గృహముం జేరక మున్యాశ్రమములకేందులకరుగవలయును? అరిగితిఁబో ముందుగా వసిష్ఠున కేలవందనమాచరింపవలయును? ఆచరించితిఁబో విశ్వామిత్రుఁడేల యేమఱుగవలయును? అలిగెఁబో నన్ను నిర్హేతుకముగా నంతము సేయుట కేల ప్రతినఁబట్టవలయును? ఆమహాత్ముని శక్తి యనివార్యముగదా! ఇప్పుడు నన్ను రక్షించువారెవ్వరు? నాకభయమిచ్చువారెవ్వరు?......హా రామచంద్రా! నీభక్తుండనగు నాకుఁ దుదకీయపరాధమును విధించితివా? హంతకులు-జారులు-చోరులు - క్రూరులు - నీతివిదూరులునగువారు పొందఁదగిన బలవన్మరణమును నానుదుట వ్రాసితివా? దుర్భరము. దుర్భరము. [అనిమూర్ఛమునుంగును.]

[ప్రవేశము—చంద్రకళ]

చంద్ర—[భర్తనుజూచి దుఃఖించుచు] హా! పరమేశ్వరా! ఆర్తత్రాణ పరాయణ బిరుదాంకితా! నానాథుని రక్షింపవా?

యయా—[లేచిభార్యనుజూచి] దేవీ! నీనాథుని రక్షించువారెవ్వరు? గాధిపట్టి చలముపట్టి ప్రతినఁబట్టఁగా దానిని నెట్టు దిట్టలెవ్వరు?

చంద్ర—ప్రాణేశ్వరా! అటులయిన లోకములో ధర్మమునకు జయము లేదా? అధర్మపిశాచము తనయిచ్చవచ్చిన మచ్చున నిరాటంకముగా విజృంభింపవలసినదేనా? నిర్హేతుకముగా నిరపరాధులు బలవన్మరణము పొందవలసినదేనా?.........హా! దుస్సహము. దురంతము. మునుల మానసములు నవనీత సదృశములందురే! అతికోమలములందురే!

యయా—జీవితేశ్వరీ! మనదౌర్భాగ్యమిట్లుండఁగా నొరుల ననవలసిన పనియేమున్నది? ఆ విశ్వామిత్రుని చేతిలో నాకు విధాత మరణమును లిఖించియుండనోపు.

చంద్ర—[చెవులుమూసికొని] హృదయమా! నీ వింకను భిన్నము గాకుంటివేమి?.....నాథా! ఇప్పుడు మనకు రక్షణోపాయము లేదా?

యయా—ప్రేయసీ! ఏలబేలవై యీలీల పలికెదవు?

ఉ॥ అక్కట! తీవ్రకోపజని । తాకులచిత్తుఁడు చండకౌశికుం
డక్కటికంబులేక నను । నంత మొనర్పఁగఁ బంతమూన నిం
కెక్కడి రక్షణంబు? మును । లెల్లరుఁగూడిన శక్తగాదురే?
మ్రొక్కఁగనేల వేల్పులకు । భూమినినీతెఱఁ బుణంబు; నెచ్చెలీ!

[నేపథ్యమున నారదుఁడు హరినామసంకీర్తనము, అనుబంధము 5]

చంద్ర—[ఆలకించి] నాథా! శ్రీమన్నారాయణ నామసంకీర్తనము వినవచ్చుచున్నది......ఆవచ్చుమహాపురుషుఁడెవ్వడో ముని చంద్రుఁడై యుండనోపు! [ముందుఁజూచి]......ప్రాణేశ్వరా! బ్రహ్మ మానసపుత్త్రుఁడగు నారదమునిపుంగవుఁడు

విచ్చేయుచున్నాఁడు. ఈ పూజ్యుని యాగమనమువలన మన కష్టములు గట్టెక్కకుండునా?

యయా—[ముందుఁజూచి] మహాత్ముల దర్శనము లాభింపకుండునా?

[ప్రవేశము—నారదుఁడు.]

యయా—[అంజలిఘటించి] హే బ్రహ్మమానసపుత్రా! త్రిలోక సంచారీ! అఘటనాఘటన సమర్థా! నమస్కారము.

నార—రాజన్యచూడామణీ! చిరంజీవివై వర్ధిల్లుము.

చంద్ర—మునికులతిలకా! వందనము.

నార—అమ్మా! సకలశుభములంబొందుము.

యయా—దేవర్షిచంద్రమా! చండకౌశిక బిరుదాంకితుండు నాపై నలుకఁబూని నన్నంతము సేయుటకుఁ బ్రతినఁబట్టుట మీ రెఱింగిన విషయమేకదా! చిరంజీవివై వర్ధిల్లుమని యాశీర్వదించితిరేల? తాత్కాలికముగా జీవితోత్సాహ వాంఛను నాలో రేకెత్తించుటకా?

నార—భూపాలమౌళీ! నాధర్మమును నేను నెఱవేర్చితిని.

చంద్ర—దేవా! నాకుఁబతిభిక్షను బ్రసాదించు మార్గము నెఱిఁగింపరా? సజ్జనదర్శనము సకలశుభప్రదాయకంబని . సమస్తశాస్త్రములు వాకొనుచున్నవిగదా!

నార—అమ్మా! సర్వమును భగవదిచ్ఛ! [కొంచమాగి] యయాతి రాజోత్తమా! నీపై నలుకఁబూనిన గాధిసూతి, తన ప్రియ శిష్యుండగు శ్రీరామచంద్రునికడ కరిగి-

యయా—[అర్ధోక్తిలోనే సంతోషముతో] అయ్యనఁ గొంతమేలే! మహాత్మా! చెప్పుఁడు.

నార—తనకు నీవలనఁగలిగిన పరాభవమును విశదీకరించినాఁడు.

చంద్ర—మా రామభద్రుఁడు - మాయిలవేల్పు -నానాథుని చర్యను దప్పుగాఁ దలంపఁడు. మునిచంద్రమా! పిమ్మట నేమయినది?

నార—ఏమని చెప్పను? కొంపమునిగినది.

యయా—[ఆత్రముతో] ఏమి! రామభద్రుడు నే నపరాధినని విశ్వసించినాఁడా?......దేవా! సందేహింతు రేల? చెప్పుఁడు.

నార—విశ్వసించుట మాత్రమే కాదు. గురుని ప్రతిజ్ఞను నిలుపుటకుఁ దాను గంకణము గట్టుకొన్నాఁడు.

యయా—[తెల్లఁబోయి] అనఁగా?

నార—ఏమున్నది! స్వహస్తములతో నిన్ను.........

చంద్ర—చెప్పుఁడు. దేవా! చెప్పుఁడు. సందేహమేల?

నార—ఏమని చెప్పను! నీనాథుని దానే చంపుటకుఁ బ్రతిజ్ఞ పూనినాఁడు.

చంద్ర—హా! రామచంద్రా! [మూర్ఛిల్లును]

యయా—హా! రామభద్రా! [మూర్ఛిల్లును]

నార—ఈదంపతు లిరువురును మూర్ఛమునింగిరి. వీరి దీనావస్థ నాహృదయమునుగూడఁ గరఁగించుచున్నది. ఇఁక నే నిచ్చోట నిలువరాదు. మరల నింకొకతూరి యేతెంచి యీయయాతిభూపాలునకుఁ గర్తవ్యోపదేశ మొనరింతుఁగాక! [నిష్క్రమించును]

చంద్ర—[లేచి దుఃఖించుచు] హా! ప్రాణేశ్వరా! కంచెయే చేను మేసినది. తల్లియే పిల్లను భక్షించినది. ఇఁక నేది దిక్కు? [ఇటు నటుఁజూచి] అయ్యో! నారదమునిచంద్రుఁ డింతలోనే నిష్క్రమించెనా! చావుకబురు చల్లఁగాఁ జెప్పుటకా యీమునితల్లజుఁ డరుదెంచెను!......హా! పరమేశ్వరా! నాదౌర్భాగ్యమిట్లున్నదా? నే నొనరించిన పూజలు గంగపాలయినవా? నిష్ఠతోఁ బట్టిన నోములు మట్టిఁగలసినవా? కావించిన దానములు వ్యర్థములైనవా? వ్రతములు రిత్తవోయినవా? భూసురుల యాశీస్సులు బుగ్గిఁగలసినవా?......హా! రామచంద్రా! కరుణాసాంద్రా! నానాథుఁడు నీ కేమి యపకృతి గావించినాఁడయ్యా?

సీ॥ సాటిరాజువటంచు । స్వాంతమం దెంచఁడు
దైవంబుగా నిన్నుఁ । దలఁచు నెపుడు
నీమనోహర గుణ । స్తోమ వర్ణనమున్న
నొడలెఱుంగక సొంద । మొందుచుండు

దావకీయాంచిత । ధైర్యశౌర్యములు గో
రంతలయినను గొం । డంత జేయు
నీదివ్య మంగళ । నిర్మలాకారంబు
నేప్రొద్దు భక్తి ధ్యా । నించుమదిని
గీ॥ తొలుత రామార్పణంబని । పలుకకుండఁ
గుడువఁ జేపదార్థముఁ దాను । గోటిమంది
వేల్పులున్నను, రాముఁడే । విశ్వభర్త!
యనుచు శ్లాఘించుఁగాదె మ । హాశయుండు

యయా—[మూర్ఛనుండి లేచి] హా! రామచంద్రా! నీభక్తాగ్రగణ్యుం డనగు నన్నే చంపఁబూనితివా?

చంద్ర—ప్రాణేశ్వరా! కాలము మంచిది కానప్పుడు మిత్రులే శత్రు లగుదురు......అయ్యయ్యో! ఇఁకెవరు మనలను గాపాడువా రెవ్వరు?...... [దుఃఖించుచు] హా! దేవదేవ! నీకుఁగల భక్తవత్సల బిరుదము నిరర్థకమా! నానాథుఁడు చేసిన దోస మేమున్నదయ్యా? ఇట్టి గుణరత్నాకరుని-ఇట్టి భక్తాగ్రగణ్యుని జంపఁ దుసనుటకు నీకు నోరెట్లు వచ్చెనయ్యా? కలాభిమాన మయినఁ జూపించితివికావే? బంధుగౌరవమునయినఁ బాటించి తివికావే? భక్తుఁడు - భూపాలవతంసుఁడు - వినయగుణసంభ రితుఁడనియయిన యోచించితివికావే? నాజీవితేశ్వరుఁడు జారుడను నెపమునఁ గృపనదొలంగితివా? క్రూరుడను తలంపున దారుణ ప్రతిజ్ఞనుబూనితివా? చోరుఁడని గ్రహించి శూరత్వ మందితివా? అకటా! లోకములో నింతటి సద్గుణ సంపన్నుఁ డింకొకఁడు లేఁడని బృందారక బృందములును, మునిసందోహ ములును గీర్తించు కీర్తనములయిన నీచెవినిబడకుండెనా?...... హా! రామభద్రా! [అని మూర్ఛిల్లును]

యయా—[భార్యం జూచి] పాపము! అన్నపున్నములెఱుంగని ముద్ద రాలు. ఈమెకీకసేది దిక్కు? ఓ ఆపద్బాంధవా! అనాధ రక్షకా రామచంద్రా! నాసౌజన్యము నీకు సంతృప్తిఁ గలిగింపక

పోవచ్చును. నాభక్తినీచిత్తమునకనురక్తిం గూర్పక పోవచ్చును. కాని యాపూతగాత్రియొక్క సాధ్వీత్వమయిన నీకుఁ గనికరము పుట్టింపలేదా? ఈమెయందయిన నీవు జాలిపూనక పోయితివా? విశ్వామిత్రుని మాటను బాటించి నా తలదీయనున్నావుగదా? నాయనంతర మీమెగతి యేమికావలసినది? ఈమెను రక్షించువారెవ్వరు?

సీ॥ పతిసేవయే జగ । త్పతి సేవ యనియెంచి
భక్తిమైఁ గావించు । భవ్యచరిత
పరుల కేకష్టంబు । వాటిల్లినను సుంత
యోర్వఁజాలని మహో । త్కృష్టచిత్త
అపరాధ మొనరించి । నట్టిభృత్యులనైనఁ
క్షమించి మన్నించు । వినుతగాత్రి
పెద్దలఁ బొడఁగన్నఁ । దద్దయు వేడ్కతోఁ
బాదసన్నిధిఁ జేరు । పరమసాధ్వి
గీ॥ స్వప్నమందైనఁ బరుసంపుఁ । బలుకు పలికి
యెఱుఁగదెన్నఁడు; స్త్రీలోక । మెల్లఁ బొగడు
నిట్టి యర్థాంగి నెట్టి యి । క్కట్టులందఁ
జేయనున్నాఁడవో కదా! । శ్రీరమేశ!

...హా! విశ్వామిత్రా! పిచ్చుకపై బ్రహ్మాస్త్రమును బ్రయోగించితివిగదా! దున్న దున్న పోరాడి మధ్యను లేగదూడకాలు విఱిచె నన్నట్లు వసిష్ఠునకును నీకునుఁగల సహజ విరోధమును బురస్కరించుకొని నన్ను సమయింపనున్నావు............ [ఆకసమువంకఁ జూచి] హా! దుర్భరము! దుర్భరము! దారుణము-మహాదారుణము. [గడగడవడఁకుచు] అయ్యో! కోదండము-వైరిజనతండ ఖండనంబగు ప్రచండ కోదండము. హా! నన్ను దునుమాడ వచ్చుచున్నది. రామచంద్రా! రక్షింపుము! రక్షింపుము. [అని పఱుగెత్తుచుఁ గ్రిందఁబడిపోవును]

తెరపడును.

రెండవరంగము—రాజభవనము.

[ ప్రవేశము—మతిమంతుఁడు ]

మతి— [విచారగ్రస్తుఁడై] అక్కటా! నిన్న మొన్నటిదాక ఆనంద కందమై విలసిల్లిన యీమందిరము నేడుఁ దుఃఖనిలయమైనది కదా! ఎప్పుడేది ప్రాప్తించునో యెరికెరుక! మామహారాజు నిరంతరహరి నామస్మరణ పరాయణుఁడు—అర్థిజనపారిజాతము! మూర్తీభవించిన ధర్మము - ఇలకవతరించిన సరస్వతి - ఈతని యందున్న సద్గుణపుంజములను ఆదిశేషుఁడయిన వర్ణింపలేఁడు. అకటా! విశ్వామిత్రా! నీవంటిమూర్ఖునికి మునినామమెందులకుఁ గాల్పనా? గర్వపిశాచము నిన్నావహించి, అహంకారభూతము నిన్నాహ్వానించి, ద్వేషాగ్ని నిన్నుదహించుచున్నపుడు నీవు మానివెట్లగుదువు? కాషాయవస్త్రములు కట్టినంతమాత్రాన గలుషమతులు నిర్మలులగుదురా? రుదురాకపేరులం దాల్చినంతనే దుష్టవర్తనులమదులుకుదురుపడునా? జడలు పెంచినంతనే యెడందసంస్కరింపఁబడునా? ఛీ! ఛీ! నిరపరాధుల బాధించుచున్న నీ తపోభూతిభూతి. అనవద్యచరిత్రుల కలసట కల్పించుచున్న నీయోగశక్తి దారుణపైశాచిక రోగశక్తి!! ఇంతకు నీకు విజయమెక్కడ? నీవే సందర్భమునందు జయింపఁ గలిగితివి? హరిశ్చంద్రుని ముప్పుత్రిప్పులంబెట్టితివి. తుట్టతుదకు ఆపూజ్యుని సత్యవ్రతమునకు దాసానుదాసుఁడవైతివి. ఆ పరాభవము నింతలోనే మరచితివా? భక్తాగ్రగణ్యులతోడి పంతములు నీయంతము కేనుమీ! మామహారాజు నిర్దోషి - నిరపరాధి. నీవంటిచండకోపులు కోటిమంది వచ్చినను మాభూపాల మౌళిని గన్నెత్తి చూడలేరు......హా! మరచితిని-మరచితిని-దైత్యాంతకుండగు శ్రీరామచంద్రుఁడే మాప్రభుని సంహారింప బ్రతినఁబూనినాఁడే! ఇకనేది దిక్కు. ఇఁకరక్షకులెవ్వరు?...రామచంద్రా! సర్వేశ్వరుండవు-సర్వాంతర్యామివి-సర్వజ్ఞుండవు. మా ప్రభువు దోషియని నీవెట్లు నమ్మితివయ్యా! సర్వకాల సర్వా

వత్సలయందుఁ ద్వదీయదివ్య సంస్మరణముతప్ప, అన్యగోప్యింద విలి యెఱుంగఁడే! భక్తశేఖరుఁడే! పరమపావనుఁడే, విశేషించిబంధు ముఖ్యుఁడే! అట్టిచో - అన్యాయముగఁ జంపఁగోరుటకు నీమన సెట్లు లంగీకరించినదయ్యా! ఇంతకు నిన్ననవలసిన పనియేమి? విధివిధాన మిట్లుండనోపు! [కొంచెమాగి] పాపము! రాజదంప తులు దుర్భరదుఃఖసముద్రమున మునింగియున్నారు. ప్రజలకీ వార్తగర్భనిర్భేదక మయినది... నేనిపుడు వెళ్ళి మహారాజుగారిని దర్శించి భగవంతుఁడు భక్తులను గావకపోఁడని ధైర్యము చెప్పిరావలయును. [నిష్క్రమించుచు]

తెరపడును.

---

మూఁడవరంగము—రాజభవనము.

[యయాతి నిద్రించుచుండఁగా తెరలేచును]

యయా—(కన్నులు తెఱచి, భయమభినయించుచు, బిగ్గఱగా) హా! రామచంద్రా! రామచంద్రా! చంపకుము - చంపకుము - నీదాసుడనయ్యా! నీపాదసేవకుఁడనయ్యా! ఓ కౌసల్యాపుత్రా! అనపరాధినయ్యా! నా మొఱనాలకింపుమయ్యా! (అనిమరల నిద్రనభినయించును.)

[అంత "నాథా! నాథా!" అని కేకలిడుచుఁ జంద్రకళ ప్రవేశము.]

చంద్ర—[భర్తను సమీపించి, చేతితోతట్టి] నాథా! నాథా!

యయా—[లేచికూర్చుండును.]

చంద్ర—నాథా! మీరు మనోధైర్యముం గోలుపోవుచున్నారు. మీ స్థితిం జూడఁగా, నాప్రాణవాయువు లెగిరిపోవుచున్నవి.

యయా—ప్రేయసీ! మృత్యుదేవత కరాళదంష్ట్రవదనయై మ్రింగెదనని మీదికి లంఘించుచుండగా, మనోధైర్యమెట్లుండును?

చంద్ర—[దుఃఖించుచు] హా! పరమేశ్వరా! మాగతియేమి?

యయా—[ఉలికిపడి] హృదయేశ్వరీ!......అదిగో......అదిగో.... కోదండము......రామబాణము......నన్నే వెదకుకొనుచు

వచ్చుచున్నది......హా! ఇకనేదిదారి? [గడగడ వడకును.]

చంద్ర—[భర్తను పట్టుకొని, గద్గదస్వరముతో] నాథా, భయములేదు భయములేదు. మీభ్రమయే మీకిట్టి మనోవ్యథంగలిగించుచున్నది......ఓ ఆర్తశరణ్యా! దీనబంధూ! కృపాసింధూ! భర్తను రక్షింపవా?

సీ॥ చతురబ్ధిపర్యంత । సామ్రాజ్యమేలుచు
సదయుఁడై నందుల । కిదిఫలంబె?
నిరతంబు నీనామ । స్మరణంబు కాంక్షించి
యిద్ధకీర్తినిగొంట । కిదిఫలంబె?
భూరిదానములిచ్చి । కోరి యాగంబుల
నెల్లఁగావించుట । కిదిఫలంబె?
పరకాంతలను మాతృ । భావంబుతోఁజూచి
యెసఁగుచున్నందుల । కిదిఫలంబె?
గీ॥ తీర్థయాత్రలుసేసి, సం । తృప్తిమీఱ
నాలయంబులు గట్టించి । యతులభక్తి
నినకులాభరణంబయి । మనుచు నిన్నె
యెదను సేవించినందుల । కిదిఫలంబె?

యయా—జీవితేశ్వరీ! నీవు పొరబడుచున్నావు. భగవంతుని దూషింపవలదు. ఆమహాత్ముఁడు ప్రేమమయుఁడు. ఆతని సంకల్పమమోఘము. అతఁడు నాకుఁదగిన ఫలమునే యొసంగినాడు. ఏమందువా ? శ్రీరామచంద్ర ప్రభుని చేతిలో మరణము సామాన్య జనులకు లభించునా? శత్రుత్వముచేతఁగాని, మిత్రత్వముచేతఁగాని, ఆపరంధాముని పాదారవిందసాన్నిధ్యప్రాప్తిం బడయుటయే ముఖ్యము......తండ్రీ! రామచంద్రా!

మ॥ అపరాధంబొనరింపకున్న నిటుల । న్యాయంబుగానీవు-నన్
దపసిన్ దృప్తునిజేయఁగోరి త్వరలో । దండింతు వంచేను నీ
నెపముంజూటను; మేలుగాఁదలతుఁ రా । నీ, దివ్యకోదండముస్;
జపముల్ సేసిన నిట్టిచావు కలదా? । జాగేల? రామప్రభూ!

మ॥ గతజన్మంబున నెట్టిపుణ్యయుత స । త్కార్యాళిగావించి, ని
మతి మెప్పించితివో కదా! అనఘ! నా । భారంబు దీర్పంగ, ను
ద్ధతి రానుంటివి దివ్యబాణములతో । దాక్షిణ్యవారాశివై
మృతికై యేల విచారమింక మదిలో । మేల్గాంటి; విజ్ఞానివై.

[ప్రవేశము—మతిమంతుడు]

మతి—[యయాతిని సమీపించి, మోమునంచి, కన్నీరుగార్చుచు నిలువఁబడి యుండును.]

యయా—[మతిమంతునిజూచి] నాయనా! మతిమంతా! వచ్చితివా? రమ్ము. నీ|ప్రభువు కడసారిచెప్పఁబోవు విషయములను |శ్రద్ధగా వినుము. ఇఁకముందు నాకుటుంబరక్షణ భారమంతయు నీభుజాస్కంధములపై నున్నది సుమీ!

మతి—[దుఃఖించుచు, గద్గదస్వరముతో] |ప్రభూ! మీతోడివారమే మేము. మీరులేనపుడు మాకీజీవితమేల? మీకంటె ముందుగనే మృత్యువు నాహ్వానింతుము.

చం|ద—ఆర్యా! మతిమంతా! తుదకు మాకుటుంబమునకు సర్వేశ్వరు డెట్టి వినాశముగల్పింప నున్నాఁడో చూచితివా? నాథునిబాసి నేనొక్క క్షణమయిన నుండఁజాలను. ముందుగా నాకొఱకు జితిని బేర్పింపుము. కన్నతల్లికంటె నెక్కుడుగా నన్ను భావింతువుగదా! ఈసాహాయ్యమొనరింపుము. నీకుఁబుణ్యముండును.

మతి—(దుఃఖించుచు) హా! శ్రీహరీ! నాహృదయమునేల వ్రక్కలింపవు?

యయా—|ప్రేయసీ!ఇఁకఁ దడయరాదు-శ్రీరామచం|ద ధనుర్విముక్త దివ్యాస్త్రమున న్నన్వేషించుచు రాకముందే, నేఁజెప్పుమాటలు నాలకింపుము.

చం|ద—నాథా! నాతోనేమిచెప్పెదురు? మీకంటె ముందే నేను స్వర్గమునకుఁ బయనమగుచున్నాను. సతులకుఁ బతితోడిదే లోకము. పతినిబాసినసతి |బతుకనేల? సహగమనము సాధ్వీమణులకు శరణ్యమేకదా?

యమా—[గద్గదస్వరముతో] ఆఁ.ఆఁ. అంతసాహసము వలదుసుమీ!

చ॥ తనయుఁడు కల్గినాఁడనుచుఁ । దద్దయుసంతస మందినాఁడ; నా
కనులకు వానియాటలును । గాంచెడిభాగ్యము లేకపోయె; నే
మని విలపింప నేమిఫల । మయ్యె గతించిన లోటులేని రీ
తిని నిఁక సాఁకుమెల్లపుడు । తృప్తిని బొందెద; జీవితేశ్వరీ!

చంద్ర— (దుఃఖించుచు) హా! పాపిష్టిదైవమా! నీవెందున్నాఁడ
వయ్యా?......హా! విశ్వామిత్రా! పాషాణహృదయుఁడా!

మ॥ అకళంకాంచిత పుణ్యశీలుడగు నా । యాత్మేశునీరీతిఁ గొం
కక, మోసంబొనరించి, కాపురము ము । క్కల్ సేసి దుఃఖాబ్ధి పీ
చికలంగప్పి సుఖంబు ద్రోసెదవె? ఛీ! ఛీ! మానివానీవు? నీ
కిఁకఁ బాపంబన భీతి సుంతగలదా । కీర్తింతురానిన్, సురల్?

యమా—[వారించుచు] ప్రేయసీ! ఇదేమి? మహాత్ములగు ముని
చంద్రులను దూషించుట యుక్తమా?

చంద్ర—ఎవఁడు మహాత్ముఁడు? అనపరాధిని - అకారణముగ-అన్యా
యముగ నంతము సేయువాఁడు మహాత్ముఁడా?

యమా—అమాయకురాలా! ఆ పూజ్యుడు నాకు మహోపకారమే
గావించినాఁడు.

ఉ॥ కాయము ఖాయమా? యెపుడో । కాటికి జేరుట నిక్కువంబె; య
త్యాయత పుణ్యకారముల । ధర్మువు దప్పక జేయు నార్యులే
శ్రీయుతుచేతి చావుగని । చెందరుముక్తిని, గల్గెనద్ది; నా
కీయిహలోకమేల? వడి । నేఁగుదు నాగురుదేవునొద్దకున్.

శరీరదార్ఢ్య ముంగోలుపోయి, వార్ధక పిశాచమున కెరయయి,
రోగములపాలుబడి హేయముగ మరణించుటకంటె, హాయిగా
నా బంగారుతండ్రి - రామచంద్రునిచేతిలో మృతిఁగొంట సద్గతి
గాదే?......(మంత్రినుద్దేశించి) నాయనా! మతిమంతా!

సీ॥ ప్రజల బిడ్డలరీతిఁ । బాలింపవలయును
రాజులేనట్టి కొ । అంతలేక
నన్నుఁ బ్రాణంబుగా । నెన్ను నాకాంతను

గాంచవలయును వేయి । కండ్లతోడ
బిడ్డఁడు పెద్దయై । విద్యాధికుండైన
నుచితరీతుల సాఁకు । చుండవలయు
మరణించినాఁడని । మరువక, సర్వదా
ఆలుబిడ్డలఁబ్రీతి । నేలవలయు
గీ॥ స్వామిభక్తుండవీవు; చె । ప్పంగవలెనె
నీకు? నాకుటుంబముగూర్చి । నిర్మలాత్మ!
నీదె భారంబు సర్వమ్ము । ప్రోదిసేసి
మహితసత్కీర్తి నార్జించి । మనగదన్న!
వ్యవహార సందర్భములలో నెప్పుడయిన నేదయిన వచియించి నను, మరచిపొమ్ము.

మతి—[యయాతిపాదములపైఁబడి] ప్రభూ! క్షమింపుఁడు. మిమ్ము లను బాసి నేనొక్క క్షణమయిన బ్రదుకఁజాలను.

యయా—[లేవనెత్తి కౌఁగిటఁజేర్చుకొని] నాయనా! నీప్రభుభక్తికి సంతసించితిని. నీవులేకున్న- అమాయకురాలగు నాయర్ధాంగి గతియేమి? నాముద్దుబిడ్డని ఎవరుపెంచి, పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పింతురోయి!

చంద్ర—[దుఃఖించుచు] నాథా! తనయుని సంరక్షించుభారము సచివ పుంగవుని యందుంచుఁడు. సహగమనమున కీదాసురాలు తొందరపడు చున్నది.

యయా—దేవి! వలదు. వలదు. నామాటంబాటింపుము. ఆత్మహత్య మహాపాతకముసుమీ!

[అంత నేపథ్యమున హరినామస్మరణము-అనుబంధము 5]

చంద్ర—[వినుటనభినయించి] ఆగానము నారదముని చంద్రునిదై యుండును.

యయా—అయిన, మహాభాగ్యమే! అవసాన సమయముగనుక హరి భక్తితత్త్వమునయిన నుపదేశముహొంది తరించెద.

[ప్రవేశము—నారదుడు]

యయా—మహాత్మా! దేవర్షిచంద్రా! ఈనిర్భాగ్యునికిక నీజన్మలో దమదర్శనాంతరము దొరకదు. ఇప్పుడే నావందనశతంబులు గైకొనుడు. [అనినమస్కరించును.]

నార—రాజా! నీకు శుభముచేకూఱఁగలదు. దైన్యము వర్జింపుము.

చంద్ర—[నారదుని పాదములపైఁబడి] బ్రహ్మపుత్త్రా! మీవచనము లమోఘములు. నానాథునిముప్పు దప్పింపరా? ఈ దీనురాలికిఁ బతిభిక్ష పెట్టరా?

యయా—కాంతా! అందని మ్రాని పండ్లకర్రుఁజాచెద వేల? శ్రీమన్నారాయణావతార స్వరూపుండగు దశరథసూతి నన్నుఁజంపనుండగా, రక్షించువారెవ్వరు? వెఱ్ఱిమొఱ్ఱప్రార్థనములు మానుము. విధివిధానమిది.

నార—[చిఱునవ్వుతో] యయాతి మహారాజా! బలవన్మరణమునకు సిద్ధపడుచుంటివా?

యయా—స్వామీ! సిద్ధపడక చేయునదేమి? గత్యంతరము లేనపుడు, ప్రాప్తకష్టంబునకు వగపనేల?

నార—[ఆలోచనమభినయించి] రాజా! ప్రాణరక్షణోపాయముం జెప్పుమందువా?

చంద్ర—దేవా! ఇంతకంటెఁగావలసిన దేమున్నది? మీపాదారవిందములకుఁబదివేల ప్రణామములు. అనుగ్రహింపుఁడు.

నార—ఆర్తరక్షణ పరాయణుండగు హనుమంతు నెఱుఁగుదువుగదా!

యయా—ఎఱుఁగకేమి? శ్రీరామభక్తాగ్రగణ్యుఁడు! మహానుభావుడు!

నార—నీ విప్పుడాతని పాలికరుగవలయును.

యయా—ఎందులకు? ఎప్పుడోపోనున్న ప్రాణముల నిప్పుడే పోఁగొట్టుకొనుటకా? సరి సరి! దేవా! దుఃఖసముద్రమున దొప్పదోగి యున్న యీ దీనునితోఁ బరిహాసమా?

నార—రాజా! నీవు పొరబడుచున్నావు. మాదృశు లెవరితోడను బరిహాసములాడరు. నాపలుకులు వ్యర్థములుకావు. కర్తవ్య

మూహింపజాలక దుఃఖాంబుధిని దొప్పదోఁగియున్న నిన్నుద్ధ
రించుటకు, జాలిఁదలంచి యింతదవ్వగు దెంచితిని. నిన్నాపవ
నాత్మజుఁ డొక్కఁడుతక్క, త్రింశత్కోటి దేవతలరు దెంచియు
రక్షింపఁజాలరు. శ్రీరఘురామ ప్రజ్వలిత భయదకోదండాగ్ని
జ్వాలలనుండి నీవు తప్పించుకొనఁజాలవు. ఉపకారముఁదలంచి
నాయొనర్చిన యుపదేశమునకు ననుఁ బరిహసించుచుంటివి.

యయా—మునీంద్రా! క్షమింపుడు. మిముఁ బరిహసించుటకు నేనం
తటి వాఁడను. ఆ యాంజనేయుండు, నిరంతర శ్రీరామచంద్ర
పాదారవింద సందర్శన లాలసుండును, రఘూత్తంసుచరణకమల
సేవాపరాయణుండును, రామనామామృతాస్వాదనా నిర
తుండును నగుటంజేసి, యూపరంధాముఁడు, దుష్టదానవ ప్రా
ణాపహార కారణంబైన కోదండంబునకు నన్నుఁబలిగాఁగొనఁ
బ్రతినఁబూనియుండ, నాపరాత్పరుని ప్రియభక్తుఁడైన పవ
నాత్మజుఁడు నాకభయం బొసంగునాయను సందియంబావహిల్లి
యట్లంటిని.

నార—రాజా! అదినేనెరుంగకఁ పోలేదు. ఆతఁడంతటి భక్తుండుకావు
ననే నినుఁరక్షింపఁ సమర్థుండు. రాఘవుని శపథంబెరింగించిన
నాతడు నీ కభయంబొసంగునా! అట్లుఁగాదు,

తే॥ గీ॥ తొలుతఁ "మాంరక్ష" యని పాద । ములను వ్రాలి
అభయ మొసగినఁ బిదప, నీ । యార్తికార
ణంబుఁదెల్పుము! రామేశ్వ । రంబునందు
తప మొనర్చుచుండె నతండుఁ । దరలిపొమ్ము॥

చంద్ర—నాథా! మునీంద్రుని యుపదేశంబమోఘము. అవశ్యాచర
ణీయము. ఆ దివ్యతేజుం డభయంబొసంగెనా, నామాంగల్య
బలంబున కంతులేదు. నిరాకరించెనా, నేనుఁగూడ, మీతోఁడి
దాననే.

నార—రాజేంద్రా! సంశయింపకుము. ఆ కేసరిసుతుం డార్తావన దీక్షా
పర తంత్రుండు. బాహుఁబల సంపన్నుండు. ఆతని ప్రభావఁ

బున కంతుఁలేదు. సాక్షాత్పరమేశ్వరావతారము!

చ॥ జనకజఁ గోలుపోయి, అను । జన్మునిఁగూడి తపించువేళ, నా
యినకులవంశ భూషణుఁడె । యీప్సితముల్ నెరవేరఁగోరి, యం
జనిసుతుఁ బూజలందనుప । సర్వశుభంబులఁ గూర్పలేదె; యా
తని శరణంబుఁ వేడినఁ ను । దారత నిన్నును రక్షసేయఁడే॥

చంద్రకళా! నీనాథుండు రక్షింపఁబడి సురక్షితంబుగ నిలుసేరు వరకా పవనాత్మజు పూజలయం దేమరకుము. రాజా, విచారింపకుము, పొమ్ము, నీకు సర్వశుభములుఁ జేకూరును.

యయా—దేవా! మీయుపదేశాను సారముగ నేనిపుడే రామేశ్వర ప్రయాణ మొనర్చెదను. యిదే నానమస్కార మందుకొనుఁడు. [అని నమస్కరించును].

నార—ఆయుష్మాన్భవ.

చంద్ర—మునీంద్రా! తమ యమోఘాశీర్వాదము నపేక్షించుచున్నాను. [అని నమస్కరించును].

నార—దీర్ఘసుమంగళీభవ. రాజా! యికనేనరిగి వచ్చెదను.

[అనుబంధము 6 పాడుచూ నిష్క్రమించును].

యయా—దేవీ! బ్రహ్మమానస పుత్రుని యాశీర్వచనము రిత్తబోవునా? యీతని యుపదేశంబాలకించి నప్పటినుండియు, హృదయమున నాశాలతిక మొలకలెత్తుచున్నది. మొలకలు వృక్షములై, శాఖలఁబ్రాకునో పుటుకలోననే మురిగిపోవునో తెలియదు. ఆర్తావన దీక్షాపర తంత్రుండగు నాంజనేయుండు నాకభయం బొసంగినచో, రణరంగంబున రామచంద్రునిఁబ్రతిఘటించి నిలచునుగదా? అధీరవర్యుని వధించిన పిదపగదా నన్నా రఘుపుంగవుడు నాల్కలఁగోరుచున్న బాణాగ్నికింధనముగా నొనర్పవలె. ప్రాణప్రదమైన భక్తుడు రావణబాణాగ్నికి జిక్కి దక్కిన సౌమిత్రిని సంజీవినీ పర్వతముందెచ్చి రక్షించిన ప్రాణదాత. సీతా దుఃఖోపశమన మొనర్ప లంకారాజ్యధ్వంసమునకుఁ జేయూతమైన మిత్రుడు. చరణకమల సేవాపరాయ

ణుడు. అట్టి ధీరోదాత్తునిపై కోదండంబు సారించి బాణమె క్కుబెట్ట గలడా? తూణీరంబునుండి బాణంబుఁ దీయుటకుఁ జేయాడునా ? పుత్రవాత్సల్యముఁ జూపు జానకి వారింపకుండు నా ? సర్వవిధముల నాకుపకారము గల్గునని యేఁ దోచుచున్నది. అపైన భగవదేచ్ఛ యెట్లున్న నట్లగుంగాక. దేవీ పోయివచ్చె ద. వియోగాగ్ని జ్వాలలకున్ శలభంబవుఁగాకుము. ధైర్యమవ లంబించి యుండుము. మతిమంతా!

చ॥ యెరుఁగుదు వెల్లసంగతుల । నేగదనే హనుమంతుఁ జెంతకున్
శరణునోసంగి, రక్షణము । సల్పునో, నేనరినంచు, మృత్యుగ
హ్వరమున, ద్రోయునో యెరుగ । నంగన, బాలుడు నున్నవార, లే
కరణిని బ్రోచెదో, ప్రజలఁ । గాచెదొ భారము నీదె సుమ్మికన్॥

మతి—[దుఃఖముతో] రాజా! ఆపవనాత్మజుడు మాకుఁదప్పక మీకు పునర్దర్శనభాగ్య మొనగూర్చుగాక.

చంద్ర—నాథా! మార్గమధ్యమున జాగ్రత ?

యయా—పుత్రకు నీక్షించినచో పోవుటకు గాళ్ళాడవు. చూడకున్న మనసొప్పదు. ముద్దుకొడుకు నిదుర లేవక పూర్వమే యేగవల యును. [అని పాదములెత్తి లోనికిజూచి నిష్క్రమించును.]

చంద్ర—[కన్నీరుగారుచుండ నిమీలితలోచనయై] హేదయామయా! కేసరీపుత్రా!

మ॥ హరివై, వీరుఁడవై కృపాళువయి, ని । త్యానందసంధాయివై
అరిగైనన్ శరణన్నఁ బ్రోతువట, నా । యాత్మేశ్వరుండిప్డు, నీ
దరికే తెంచెడి, ప్రాణభిక్షుకయి, నీ । దాక్షిణ్యమున్ జూపి, యో
కరుణాసాగర, రక్షసేయగదె, దీ । క్షాబద్ధతన్ మారుతీ॥

తెరపడును.

తృతీయాంకము—సంపూర్ణము.



ఓమ్.

శ్రీ రా మా!

# హనుమద్రామ సంగ్రామము

## చతుర్థాంకము

---

### మొదటిరంగము

[రామేశ్వరమునందలి ఫలవనము—ఆంజనేయుడు నిమీలితనేత్రుడై]

ఉ॥ శ్రీరఘువంశ భూషణ! వ । శీకృత దివ్యపదారవింద, వం
దారు మునీంద్రబృంద, వర । దా, సురవందిత భక్తవత్సలా
తారకనామ, రమ్య గుణ । ధామ, జగన్నుతభీమ, శ్యామలా
కార దశాననో, గ్రకరకంఠ విలుంఠన రామపాహిమాం॥

జగదభిరామా! పట్టాభిరామా! కోదండరామా! జానకీరమణా యీశరీరమునందలి ప్రతిరక్తబిందువును, ప్రతిరోమాంచలమును, సర్వశుభప్రదమై, తారకమంత్రమై, అఘవినాశకమై, ముక్తిమార్గాదర్శకమైన నీ పవిత్ర నామాక్షరముల జపించుచుండియు, నీనామామృతము ననవరతము గ్రోలుచుండియు తనివి నందకున్నవే? విశాలప్రపంచమంతయూ నేనై, ఆకాశమునందలి నక్షత్రములన్నియు నేనై, సకలచరాచరములును నేనై, నీనామమంత్ర జపమొనర్చినందనివి తీరునేమో! అంతటి

భాగ్యము నాకు లభించునా ? రామా! పరంధామా! నీకృపాం బదృష్టి నాపైఁబరపి, పుత్రవాత్సల్యముంజూపి, నీచరణసేవ మరువకుండ రక్షించుచుండుము. నీకు నాపై గల వైరము... హా యేమంటిని. నీకు నాపై గల వైరమనియా. రామా! అప రాధిని క్షమింపుము. నాపై గల ప్రేమయనఁబోయి యట్లంటిని. తల్లీ! జానకీ! క్షమింపుమని నీవును నాజనకునకుఁ బోధింపుము. సర్వకాల సర్వావస్థలయందును మీచరణదాసుఁడీ మారుతి. మీయాజ్ఞను నిర్వర్తించి యంజనీసూనుఁడు. రామా! రఘు రామా! సీతారామా! [అని కనులు మూయును].

యయా—[ప్రవేశించి] అరివీర భయంకరా! దీనశరణ్యా! భక్తాగ్ర గణ్యా! రక్షమాం. రక్షమాం. [అని పాదములపై వ్రాలును].

ఆంజ—ఓయీ! శ్రీరామచంద్ర పాదారవిందముల సాక్షిగా నీ ఆంజ నేయుఁడు నీకభయఁమొసంగు చున్నాఁడు, లెమ్ము. [అని లేవ దీయును].

యయా—[ఒణకుచు] స్వామీ! అభయమొసంగితిరా! రక్షించెదరా!

ఆంజ—ఓయీ! యింకనూ భీతిల్లుచుంటివా! త్రింశత్కోటి దేవతలరు దెంచియూ, నిను ముట్టజాలరు. యెవరువచ్చి నినువిడువు మన్న ను విడువను. భయంబుడుగుము.

యయా—[గుండెసర్దుకొనుచు] అబ్బ! రక్షింపఁబడుదునను ధైర్యము వచ్చినది. మహాత్మా నీదాసుడను.

ఆంజ—నాయనా! నీనామధేయమేమియో యెరుంగవచ్చునా?

యయా—స్వామీ! నానామధేయము యయాతి యందురు.

ఆంజ—యేమీ! యయాతి రాజేంద్రుడా! శ్రీరఘురామభక్తశేఖరు డా! రామభక్తులకుఁగూడ ప్రాణపాయమా?

యయా—రాముడే వధింతునని ప్రతినబూన......

ఆంజ—[ఆత్రుతతో] ఆఁ. యేమీ! రామచంద్రుడా! ప్రతినబూను టయా! హా! రామా! రఘుకులాంబుధిసోమా! త్రిజగన్నుత శౌర్యరమాలలామా! నీతోడి వైరమా. భక్తిపారవశ్యమున

నింతకుమున్ను "నీకు నాపైఁగల వైరమని" నోరుజారి యుచ్ఛరించితిని. అదియే నిజమయ్యెనా! కాదు కాదు. నీకునాపైగల ప్రేమ యధికము, భక్తవాత్సల్యము మెండు. అట్టిచో నీవు నాపైనలుక బూనెదవా! కడచి కూర్చుండక నిర్హేతుకముగ నీపై నైరమార్జించితిని. స్వప్నమందైన యిట్లగునని తలపను. గురుతుల్యుడు, దైవసముడు, కృపానిధియైన జనకునితోడ కయ్యమున కియ్యకొనుటయా! గృధ్రువచ్చి పిల్లను వెక్కిరించి నట్లు శివధనుర్భంగ రణరంగ మార్తాండుండైన రఘువీరుని యుద్ధావనిఁ బ్రతిఘటించి నిల్చుటయా! ప్రజ్వలితాగ్నిజ్వాలల పైదండెత్తు శలభంబు చందంబున, ఇనవంశోద్భవు భుజబల పరాక్రమ స్ఫురిత కోదండాగ్ని జ్వాలల నెదుర్చుటయా! హా, ఘోరము. రామా! దశరథరామా! దుష్టదానవ సంహార సమయంబునఁ మ్రోగించు నీకోదండ టంకారధ్వనులు నీ చరణదాసుల కర్ణరంధ్రంబుల నెట్లు ప్రతిధ్వనింప జేయుదువయ్యా వనసంరక్షణోప కరణములైన నీబాణములు, నిరంతరము నీ భవన్నామామృత ధారలంగ్రోలు భక్తుల కంఠంబులఁ ద్రుంచుటకు తూణీరమునుండి యెట్లు వెలువడునయ్యా. ఆర్తత్రాణ పరాయణ దీక్షాబద్ధ కంకణభాసురమైన నీదక్షిణహస్తము నీయాప్తవర్గముపై బాణప్రయోగ మొనర్చుటకు నారిఁనెట్లు సారింపఁగలదయ్యా. అహల్యాశాపవిమోచన కారణంబైన నీమృదుపదములు పుత్రతుల్యులగు భక్తవర్యుల వధించుటకు రణరంగమునకెట్లు నడువగలవయ్యా! దీనవదనమై పాపకృత్యా వలంబీకుల భారమువహింపలేక యుష్ణాశ్రుబిందువులఁ రాల్చు వసుంధరా భారమును తగ్గింప నుత్సహించు నీకోమలహృదయము తారకమంత్ర పీయూషాస్వాదనముఁదప్ప! అన్యచింతన నొల్లని భవవిదూరుల రక్తబిందువుల కన్గొనఁజూచుట కెట్లంగీకరించునయ్యా! రామా! రఘుకులాంబుధిసోమా! పరంధామా! నేనిపుడేమి సేయుదును. రాజేంద్రా! అయ్యవతారపూరుషుని

ప్రతిజ్ఞ తొలుతనే నాకేల చెప్పకపోయితివయ్యా.

యయా—మహాత్మా! తొలుత నెరింగించినచో నాకు మీరభయం బొసంగి యుందురా!

ఆంజ—అవును, అభయంబొసంగియుందునా! మేఘశ్యామునితోడి వైరమార్జించుట కంగీకరింతునా! రామా! సర్వసద్గుణస్తోమా! రణాంగణమున సౌమిత్రి మూర్ఛిలినంత ననుదగ్గరకుంజీరి, ఘుత్రొసంజీవినిందెచ్చి, లక్ష్మణకుమారునకు ప్రాణదానం బొనర్పమని యాజ్ఞాపింప, నేజని పర్వతముం బెకలించి తెచ్చుతరి బ్రహ్మపురం బీక్షించి తత్పుర పరిపాలనా కాంక్షితుండనై నిను వేడ, కుమారా భవిష్యద్బ్రహ్మ వౌదువుగాకయని వరంబొసంగిన దయామయుడవే. నీతోడ కయ్యమునకెట్లు కాలు దువ్వుదును?

[అంత నంగద సుగ్రీవు లరుదెంతురు]

అంగ—బాబా! ఆంజనేయుండెందులకో చింతాక్రాంతుడై యున్నట్లున్నది.

సుగ్రీ—పోయి విచారింతము. [ఆంజనేయునిసమీపించి] పవనాత్మజా! నీ యీ నిర్హేతుక విచారంబునకుం గతంబేమి?

ఆంజ—నిర్హేతుకమేమి. సహేతుకమే.

చ॥ జనకుఁడుఁ స్వామి! మద్గురుడు। సర్వజగన్నుత కీర్తిసాంద్రుడున్
వినుత పరాక్రముండు నరి। వీరభయంకరు డార్త రక్షణున్
డనఘుడు, సర్వసాక్షియగు। నా రఘువీరునితోడ కచ్చుకున్
జను విపరీతమయ్యెనని। స్వాంతమునన్ దలపోసి కుందుదున్.

అంగ—} ఆ. యేమంటివి: రాఘవునితోడ యుద్ధమొనర్పవలసి
సుగ్రీ—} వచ్చెనా. అదెట్లు?

ఆంజ—రామచంద్రుడు డీరాజేంద్రుని వధింతునని ప్రతినఁబట్టె. అది నేనెరుంగక యభయ మిచ్చితిని.

సుగ్రీ—[యయాతితో] రఘూద్వహునకే యపచార మొనర్చితివా?

యయా—జానకీపతికి నేనెట్టి యపచారమునుఁ జేసియెరుగను. వేటతమ

కంబున తృష్ణదీర్చుకొనుటకై మున్యాశ్రమంబున కేగితిని. తొలుదొల్త వశిష్ఠుని జూచియుండుటచే యమ్మహానీయునకు నమస్కరించి తుది విశ్వామిత్రు నీక్షించి యారాజర్షికి నమస్కరించితి. ఇది నాయపరాధము. తొలుత తనకు దండప్రణామంబు లొనర్పలేదని కౌశికుండు కోపోద్దీపితుడై నన్నునేక మర్యాపలాడి యింత జేసె.

సుగ్రీ—తొలుదొల్త నామునికోపికే యేల నమస్కరింపకఁ బోయితి వయ్యా!

యయా—తొలుత కౌశికునిఁజూడలేదని తెలిపితినే!

అంగ—యిదంతయు మోసము. రాముఁడు వధింతునని బల్కినబూని న విషయముఁ దెలిబుచ్చుకుండ కృత్రిమవ్యాపారమున శరణార్థియై హనుమదాదులకు సంగ్రామముఁ గల్పింప నిట్లు జేసిన యీపాపిని నిశితకరవాల ధారలకు బలియొసంగెద. ఓరీ నీచా! నిలువుము. [అని కత్తి దూయుచున్నాడు].

యయా—[గడగడ వడంకుచు] అంజనీపుత్రా రక్షింపుము.

ఆంజ—అంగదా! యిదియేమి. యింతటి అత్యాచారమా? యీతం డెవరని తలచితివి. భక్తాగ్రగణ్యుడు. రాజచంద్రుడు. రామచంద్రుడు మాత్రము విధిఁజాలక విశ్వామిత్ర ప్రోద్బలంబున నీమహానీయుని వధింపఁబూనెను కాని తనభక్తునితాను వధింప నంతటి వివేకశూన్యుడుకాడు. శరణార్థి. చేతనైన సాయమొనర్పవలయును కాని యొరనుండి కత్తినిదూసి వధింతునని పైన బడుటయా. క్షుద్బాధచే యన్నమాసించిన వానికి విషం బిడుటయా. తృష్ణబూని తపించువాని కెండమావుల జలప్రవాహముని చెప్పుటయా! అట్లొనర్చిన యెడల రఘుపుంగవునకే అపచార మొనర్చిన వారగుదుము. శాంతింపుము.

అంగ—అదియేమి. రామవిరోధిని వధించుట యపచారమా!

ఆంజ—యేమంటివి. రామవిరోధియా. కాదు, రామభక్తుడు. విధి వశమున నిట్లు సంభవించెనని యిపుడేకదా తెల్పితిని. ఒకవేళ

విరోధియేయైనను వధించుట యపరాధ మొనర్చుటయే! యెట్లందువా? యీరాజేంద్రుని వధింపఁ బ్రతిన బూనినది రామచంద్రుడు. యీతని నీవిపుడువధించినచో రాముడు ప్రతిజ్ఞా పాలనుడను వాక్యము మొక్కవోవదా? యింతకన్న నింకేమపరాధ మొనర్పవలయును. అది యట్లుంచి

మ॥ శరణన్నన్ పరిపంథియైన, నటు శి । క్షాపాత్రునిన్ జేయ డా
కరుణాసాగరు డట్టిచో నతని భ । క్తశ్రేణిలో వార లె
వ్వరలైనన్ శరణంబొసంగియు వధిం । పన్ జూడగా నయ్యో న
వ్వారె ధీశాలురు, కించనొందుఁగద య । ప్పద్మాక్షుడున్ మిత్రమా॥

అంగ—ఆంజనేయా! అటులైన నీవాకోదండ రామునితో రణ మొనర్పఁగృత నిశ్చయుడవై యుంటివా!

ఆంజ—నాయనా! అవుసరమైన తప్పునా? విధివిధాన మెట్లున్నదో అట్లు జరిగియే తీరవలయును.

సుగ్రీ—హనుమా! అవ్యక్తమునఁ బడుచున్నావు. ఆజగద్వంద్యుని కయ్యమున నిర్జించుటయన సాధ్యమైన పనికాదు.

ఆంజ—ఆపరంధాముడు, దశరథరాముడు, జానకీరాముడు, నామొరాలకింపకుండునా. ననుగూర్చియైనను యీరాజేంద్రుని రక్షింపకుండునా?

సుగ్రీ—రక్షింపనిచో?

ఆంజ—రక్షింపనిచో యికనేమున్నది. యుద్ధమే సిద్ధము.

సుగ్రీ—జయమో?

ఆంజ—జయమున కేమికొదువ! యేమహామంత్ర జపము సప్తవార్ధుల లంఘింపగల సామర్థ్యము నాకొసంగెనో, యేమహామంత్ర జపము అక్షయాద్యసురుల నొక్కండఁనుక్కడింపగల సామర్థ్యము నాకొసంగెనో, యే మహామంత్ర జపము అనేక దానవవీర సంరక్షణమునన్నున్న లంకాదహన మొనర్పగల సామర్థ్యము నాకొసంగెనో, యేమహామంత్రజపము శ్రీరాముండనుచరులఁ గూడి లంకాపురిం జేరుటకు సప్తవార్ధులఁగట్టగల సామర్థ్యము

నాకొసంగెనో, యేమహామంత్ర జపము అహిమహిరావణుల బారినుండి రామలక్ష్మణుల రక్షింపగల సామర్థ్యము నాకొసంగెనో, యేమహామంత్ర జపము జానకీసహితంబుగ శ్రీరాము నయోధ్యకుంజేర్చి పట్టాభిషిక్తునిం జేయగల సామర్థ్యము నాకొసంగెనో, అట్టి మహామంత్రము, శ్రీరామతారక మంత్రము నా యధీనమైయుండ రాముడు జగద్రక్షకుండైననేమి, వీరాధివీరుండైననేమి, అవతార పూరుషుండైననేమి. ఆ భద్రాత్ముని నిర్జించు సామర్థ్యము నాకుఁగలుగదా? శ్రీరామచంద్ర మృదుచరణ కమల సేవాపరాయణుండనై, ఆ దశరథాత్మజునితోడఁ బోరొనర్చి యపజయమంది శరణార్థి నాతని బాణాగ్నికిం ధనమొనర్చితినన్న నా రఘూద్వహునకే తలవంపులుకావా? పుత్రున కవమానంబుఁ ఘటిల్లిన జనకునకు ఘటిల్లినట్లు కాదా? ఆ జగజ్జనకున కాయభిమాన ముండదా?

అంగ—తే॥ గీ॥ రాఘవునితోడ కయ్యంబు । ప్రాప్తమయ్యె
వనుచుఁ గుందక రణమందు । నతనితోడ
డీకొనుదునందు విధిచేమి । పోకడకట
ప్రతిన పాలించు సమయాన । భక్తుడెవడు॥

యయా—[తనలో] వీరిర్వురును నీధీరవర్యుని నిరుత్సాహునిఁజేయుచుంటిరే! దైవమా! యేమిచేయనుంటివో కదా!

సుగ్రీ—వాయుపుత్రా!

ఉ॥ వాలినిఁద్రుంచి,మద్హృదయ । వాంఛితముల్ నెరవేర్చి,యెంతయో
మేలొనఁగూర్చి, నన్ బరమ । మిత్రునిగా నెదనెంచు, జానకీ
లోలు శిరంబుఁ, గచ్చియుఁ వి । లుంఠనముం బొనరింపఁ, దోడు రా
జాలను, రక్షఁజేయు గుణ । సాంద్రుని భక్షణసేయు నట్లుగన్॥

అంగదుడు నాతోఁడి వాడేకదా. జాంబవంతుఁడిందుల కంగీకరింపడు. యేతోఁడునూలేక, నీవొక్కరుండవే కయ్యమొనర్తువా? వృద్ధోపదేశములు వేదతుల్యములని యెరుంగవా?

అంజ—కాదనిసదేఁరు! మీరు నాకీ పిరికిమందేలఁ బోసెదరు. నా

దృఢసంకల్పము నాలకింపుడు.

చ॥ కులగిరులెల్ల డుల్లినను । కుంభిని శృంగిన వార్ధులింకినన్
జలజహితుండు, పశ్చిమ ది । శం బ్రభవించిన, నింగి వంగినన్
బ్రళయము కల్గినన్, కుముద । బాంధవుడున్ గతిఁదప్పి పోయినన్
జ్వలనుడు చల్లనైన, విడఁ । జాలనిదే శరణార్థిఁ గాచెదన్॥

సుగ్రీ—అంగదా! నీవేగి యీవృత్తాంత మెరింగించి, జాంబవంతుని దోడ్కొని రమ్ము. కేసరీనందనా?

తే॥ గీ॥ సాటి వీరునితోనని । జలుప దగును
కాని, దోర్వీర్యుఁడౌ రాము । కలన నెదిరి
గెలువ శక్యమె, భక్తుడై । చెలగు మాత్ర
తలకు మీరిన పనిఁజేయఁ । దగునె చెపుమ॥

ఆంజ—తలకు మీరినపనియే. విధి యనివార్యమైనతరి నెంతటిదుర్ఘట కార్యమైన నాచరింపకఁ దప్పదు.

మ॥ రసహీనంబగు కైతవోలె, సభలో । రాణింపకే యెంతో, వి
క్కనమౌ పాఁడితియట్లు, నిశ్చలత మ్రొ । గ్యంబైన భక్తింబలెన్
పసలేనట్టి బలంబుమాడ్కి, శరణున్ । బ్రార్థించు, భీతాత్ము, నిం
పెసగన్, రక్షణఁజేయలేని పురుషుం । డేలా వృథాధారుణిన్॥

[అంత అంగద జాంబవంతులు ప్రవేశింతురు].

జాంబ—వాయుపుత్రా! యేమి యీఘోరము, రామభద్రునితోడ వైరమా! జగజ్జనకునితోఁడ కయ్యమొనర్చుటయా?

మ॥ అరిరాజన్యుల పాలికాలు, డిన వం । శాంభోధి చంద్రుం, డనం
తర దివ్యప్రతిభా విశాలుడయమో । తాపినిఁ జంపంగ, దు
ర్భర దీక్షంగొని, ప్రాణరక్షణకునై । పాల్పడ్డ, నీవెంత వే
దురువో, రాఘవుతోడి కయ్యమన, నే । ద్రోయంచు లోనెంచితే॥

ఆంజ—పితామహా! అపరాత్పరునితో రణమొనర్చుటయన నేదో యని యెట్లుతలంతును. లెక్కకు మిక్కుటంబైన మృక్కడి రక్కసుల నుక్కడగించిన జగజెట్టియైన రఘురాముతోఁడి కయ్యమన నేదో యనియెట్లు తలంతును. సంకల్పమాత్ర జగద్విజయ మగ్గలమగు

శ్రీరామునితో నని యొనర్చుటయన నేదోయని యెట్లుతలంతు
ను. యిపుడింతకన్న నేమిసేయుదును.

మ॥ బలశౌర్యంబుల నాకుఁగూర్చి, మది, సం । భావించినన్ బ్రెతుగా
"గెలువన్‌జాలరు నిన్ రిపుల్, జయము నీ । కేలన్ విరాజిల్లు, ని
య్యల" నంచున్ నన్నుఁ బ్రేమజూచు విభుతో । నేలీల శ్రీకొందు నే
కలనన్! గావకనెట్లు వీడుదును, దీ । క్షన్‌బూనియున్ మిత్రునిన్॥
తే॥ గీ॥ వధయొనర్చెదనంచు, నే । ప్రతిన బూను
వాని, రక్షింపసమకట్టె । పవనసుతుఁడు
యెంత విశ్వాసహీనుఁడో । యీతఁడనుచు
రాముఁడెంత నిందించునో । యేమొ నన్ను॥
మ॥ చరణాంభోరుహదాసుడై, విభునితో । సంగ్రామమున్ జేయగా
దొరకొన్నాఁడితడంచు, లోకులెటులన్ । దూషింతురో, భక్తిత
త్పరుడౌ పుత్రుడయో కృతఘ్నుడగునే । తానిట్లు, దాన్ జానకీ
సరసీజేక్షణ యెంతచింతవడునో । సౌమిత్రి యెట్లెంచునో॥

జాంబ—కేసరీనందనా! గతించిన దానికి వగచిన ప్రయోజనములేదు. యిప్పుడైన నీవా జగజ్జనకుని చెంతకుంజని, అపరాధంబు క్షమింపుమని పాదాంబుజలపై వ్రాలి యీదీనుని రామచంద్ర పరమొనర్పుము. ఆ దీనదయాళుడు నీపై నాగ్రహమువూని యనుగ్రహింప గలడు.

ఆంజ—తాతా! యెంతనైచ్యమగు యుపదేశ మొనర్చితివి. యే మహాత్ముడైన శరణువేడి ప్రాణంబులు గాపాడుకొనకుండనింత తడవే రక్షింతునని బీరంబులంబల్కి యిప్పుడీతనిఁజేసేత రాఘవున కప్పగింతునా? భీతహృదయమై శరణుజొచ్చిన హరిణము ను చేసేత బెబ్బులినోటి కందించుటయా! యిందులకు నామనం బంగీకరింపదు. ఆర్తావన దీక్షాపర తంత్రుడు, దీనజనకల్పద్రు ముడు, అనంతకోటి సూర్యప్రభాభాసుర తేజోవిరాజితుడు, శ్రీరామచంద్రుడు నాముద్దుచెల్లింప యీరాజేంద్రుని రక్షింప కుండునా?

జాంబ—యెంత యవివేకి వగుచుంటివి. శ్రీరామచంద్రుడు ప్రతిజ్ఞా భంగమును కోర్చునా? వంశాంకురంబగు భాస్వరుండడ్డుదెంచి వారించినను, ముక్కోటిదేవతలడ్డుదెంచి మొత్తుకున్నను, పాతాళుండడ్డుదెంచి వలదన్నను రాఘవుడు తనప్రతిజ్ఞను పాలించియే తీరును. నా యుపదేశము నైచ్యమో యుత్తమమో, తగునో, తగదో చెప్పవలసిన విధిగనుక చెప్పితిని. రామునితో సంధియే యొనర్తువో యుద్ధమేయొనర్తువో ఆపైన నీయిష్టము.

అంజ—తాతా! నాపైనాగ్రహించుచుంటివా? శరణార్థిని రక్షించుట పాడిగాదా? శ్రీరామచంద్రు డాపన్న శరణ్యుడుకాడా? నిరంతర మాకృపాసింధుని నామామృతాస్వాదన మొనర్చు నాకా పరాత్పరుని దీనదయాళుత్వమున సహస్రాంశమైన యలవడదా! ఆ జగద్రక్షకుడు నాపైఁదన కృపాకటాక్ష వీక్షణములఁ బ్రసరింపఁజేయడా!

మ॥ శరణార్థిన్ రఘుపుంగవా, సుజన ర। క్షాదక్షయంచున్ పదాం
బురుహ ద్వంద్వముపైన వ్రాలి, కరుణాం। భోరాసిలోముస్గి, నే
నురుభక్తిన్ మనఁజూతు! కానియెడ, నా। యోంకారధాముండు,నన్
దురమందున్ వధియింప నైక్యమును బొం। దున్ ప్రాణమా
రాముతో॥

మ॥ అకటా! యెంతటి పాపకర్ముఁడనో, ద। ర్వాంధుండనై, చేటునిం
చుక యోఁజింపక ప్రాణమిత్తునని! యీ। క్షోణీశునిన్ జేర్చి, మా
మక జీవాత్మునితోఁడి పోరితము ని। ష్కామ్యద్కిన్ సమార్జించి,యిం
త! కుయోగంబు ఘటిల్లినందులకు, చిం। తన్ గుందుదున్నెమ్మదిన్॥

సీ॥ తారకామృతమును। దప్పిఁగొనెడి జిహ్వ
రఘువీరుతో రణ। ప్రాప్తిగోరె
హరిచింతనము తప్ప। నన్యమొల్లని యాత్మ
రాఘవులో రణ। ప్రాప్తిగోరె
శ్రీరామ భజనలఁ। జేయు నీకరములు
పద్మాక్షుతో రణ। ప్రాప్తిగోరె

మునిజనావను దివ్య । మూర్తినిగను కనుల్
భద్రాద్రిత్ముతో రణ । ప్రాప్తిగోర

తే॥ గీ॥ అక్కటా, యెంత దుర్యోగ । మబ్బె, నేమ
నందు, దుర్విధిన్ దైవమా । యాత్మబాంధ
వులకు వైరంబు సమకూర్చి । కులుకుచుండె
కౌశికుని రూపముననను, రా । కాసి వోలె॥

దుర్భరము. దుర్భరము. అనుక్షణమును భద్రసార్థాయకుని తోడి వైరమనుమాట కర్ణరంధ్రంబుల మార్మోగుచు, కెరటములవలె యరుదెంచుచున్న దుఃఖముతో యధిమధ్యము నకుం గ్రోయుచున్నది. దివ్యమాల్యాంబర భూషిత శ్యామలాకార దివ్యతేజో విరాజితుండగు రామభద్రుడీ కట్టెదుట సాక్షాత్కరించి "హనుమా! రణరంగమున, ననుబ్రతిఘటించి నిల్తువా? నాచరణ దాసుండవయ్యును, నేవధింపఁ బ్రతిన బూనిన మందభాగ్యుని నీవు రక్షింపఁ గంకణముఁగట్టితివా? మనోవాక్కాయ కర్మంబుల నను దైవముగానెంచి భజించుచూ, నాతోఁడనే యుద్ధమొనర్ప నిశ్చయించితివా? మన బాంధవ్యము నేటితో నూకటి వేళ్ళతోఁగూడఁ బెకలింపనెంచితివా!" యని శాంతస్వభావమున నాకుదోబోధించు చున్నట్లు పొడఁ గట్టుచున్నది. అదుగో, అదుగో నారాముడు. శరణాగతరక్షణ బిరుదాంకిత హస్తకంకణ ఘంటానినాదము కర్ణరంధ్రంబుల ప్రతిధ్వనించుచుండ, "కుమారా! నినురక్షించెదనని మృదుమధురవాక్కుల ప్రచరించుచు, హిమానీసమ కృపారసదృష్టి నాపై విరజిమ్ముచుండెను. రామా! జగదభిరామా! పట్టాభిరామా! బాల్యచాపల్యంబునఁ బుత్రుడేదేని యపరాధ మొనర్చిన, తజ్జనకుండు సహించి, సుతుడు విపత్పరంపరలఁదగులొకనకుండ రక్షింపడా. దుండగీడై దురితంబులాచరించిన పుత్రునిపై కోపోద్దీపిత మానసుండై శిక్షాపాత్రునిఁజేయ నరుదెంచు జనకునెదుట నిల్చి, కన్నీరుగార్చుచు "జనకా,

మన్నింపు కెన్నటికి నీదుండగము లాచరింప"నని పల్కినచో యెంత కర్కశహృదయుడైనను, జాలిఁగొల్పు పుత్రుని వాక్య ము లాతని హృదయమును హిమానీ ప్రవాహముగ నొనర్చి నోట మాటరాక డగ్గుత్తికతో పుత్రుని బిగియార కౌగలించు కొని యానందాశ్రువులఁ రాల్పడా! అట్లే జగజ్జనకుండవగు నీవు నా యపరాధంబుల మన్నింపవా? నను కరుణింపవా? రామా! రామా! నీవు ననురక్షింతునని యనువరకు నీపాదాంబుజముల విడువను. పోబోను. నిలువుము. రామా! రామా! రక్షిం పుము. రక్షింపుము. [అని మూర్ఛిల్లును].

జాంబ—సుగ్రీవా! మన యాంజనేయుడు దుఃఖాతి రేకంబున మూ ర్ఛిలినాడు. ఆపరాత్పరునితోడ యుద్ధమెట్లును దప్పునట్లు దో చదు. సత్యవాక్పాలనా ధురీణుండగు రామభద్రుడు ప్రతిజ్ఞా పాలనంబునకుఁ వెనుఁదీయడు. నిరంతర మాపరాత్పరు చరణ కమల సేవాపరాయణ బాహుబల విక్రమోపేతుండగు మా రుతి శరణార్థిని విడువడు. మహాప్రళయము సంభవింపక తప్పదు.

అంగ—తాతా! ఈయుద్ధము మనయందర ప్రాణములకు వచ్చినది.

యయా—మహాత్మా! యింతటిచేటు మూడుటకు నేనుకదా కారణము.

సీ॥ క్రూరమృగావళిఁ । గూల్ప కానన సీమ
కే నా దినంబున । నేగనేల
యేగితిఁబో డస్సి । యాగతి మౌనుల
యాశ్రమంబుల చెంత । కరుగనేల
అరిగితిఁబో, కౌశి । కాదులందరు నందె
యుపవిష్టులై కూడి । యుండనేల
ఉంటిరిపో, తొల్త । నుగ్రకౌశికు వీడి
వాసిష్టునకు మ్రొక్క । వరలనేల

తే॥ గీ॥ కౌశికుం డుగ్రుడై, నాదు । కంఠమిలను
ద్రుంపదలచి రాఘవునట్లు । బ్రోత్సహింప

నేల, నేయాంజనేయుని । పాలఁబడఁగ
నేల, దుఃఖించి చావక । కాలగతికి॥

భువిపై పుట్టొందినందులకు ఫలమా రఘురామునిచే మరణము సంప్రాప్తించి నందులకు సంతసింపక, మోక్షదాయకుని కో దండాగ్ని జ్వాలలకొర కెదురుఁ జూడక, సంసార వ్యామోహ ము త్యజింపఁజాలక అవివేకినై, భీరువునై, అంజనీ పుత్రుని శరణునర్థించి, మీకందరకును దుఃఖముఁగల్గ జేసితిని. మహా త్మా క్షమింపుడు. యిక నామార్గమున నేనేగెదను. నా యొక్క ప్రాణకొరకై యిందరు చింతాక్రాంతులుగ నొనర్చు టయన నాకే విచారముగ నున్నది. సెలవొసంగుడు.

జాంబ—ఓయీ! యెంతమాటంటివి. పోఁదలచిన వాడవు తొలుతనే యీతని నాశ్రయింపకుండ నున్నచో బాగుండెడిది. శరణుజొచ్చి శరణమిచ్చిన పిదప నేగినచో మా మారుతి యింకనూ దుఃఖం పడా? యీ యుద్ధమునకుఁగాదు. యీతని యనివార్య దుఃఖ మునకు కారణభూతుండ వగుదువు.

సుగ్రీ—అదిగో. ఆంజనేయుండు సేదదేరుచున్నాడు. యిపుడు కర్తవ్య మేమియో బోధించి పవనాత్మజునకు దుఃఖోపశాంతి యొనర్ప వలయును.

ఆంజ—[లేచి] రామచంద్రా! యిపుడు నేనేమిచేయుదును!

జాంబ—వాయుతనూజా! గతించిన దానికి వగచినఁ బ్రయోజనమేమి ముందు కర్తవ్య మాలోచింప వలయునుగదా! లెమ్ము. వగవకుము.

ఆంజ—తాతా! యేదేని నిరపాయమైన యుపాయమున్న బోధింప రాదా.

జాంబ—బోధించుట కేమున్నది.

మ॥ బలసంపన్నులతోఁడ పోరితము సం । ప్రాప్తించుచో, పెక్కు భం
గుల ప్రార్థించియో, మొక్కియో, కలన, మీ । కున్ మాకుఁ
గాదంచు, భృ

త్త్యులఁ గావందగునంచు, విన్నపములె । న్నో, దీనతన్ రాయబా
రులతోఁబంపితిమొ, సంధిసేయఁదగు, పో । రున్మాని సఖ్యంబుగన్॥

సుగ్రీ—ఈ యాలోచన మద్భుతముగ నున్నది. దీనదయాళుండగు రామచంద్రుడు సంధికొడంబడెనా సరియే, లేకున్న యుద్ధ మొనర్చుటయే నిశ్చయము. ఆ పరంధామునితోఁడి కయ్యమున జయమందితిమా! శాశ్వతకీర్తి నందగలము. లేదా మోక్షము లభించును.

అంగ—మన హనుమానుడు రామచంద్రుని జయింపగల సమర్థుడే.

అంజ—పితామహా! అటులైన మన యంగదుని రాయబార మంపుదమా?

జాంబ—అట్లే పంపుదము. అంగదా! నీవా రామభద్రునికడ కరిగి యెవ్విధముననైన సంధి పొసగించుకొని రావలయును.

అంగ—సంధి వచనము లేవియో తెల్పుడు. యీ క్షణముననే నేనా రామభద్రునిచెంతకరిగి సాధ్యమైనంతవరకు ప్రయత్నించెదను

జాంబ—విషయములన్నియూ నీవెఱింగియే యుంటివికదా? ఆ రామభద్రునితో నిట్లుచెప్పుము.

మ॥ కరముల్ మోడ్చి వచించుచుంటి, వినుమో।కంజాక్ష, భీతార్తుడై
శరణున్ వేడ, యయాతి, మారుతియు, దీ। క్షుంబూనె రక్షింప, తా
నెరుగన్, రామి, భవత్ప్రతిజ్ఞ నిపుడే । నేమందు దుఃఖాంబుధిన్
దొరలెన్ సర్వమెరింగి, పావని, భవ । త్పూనుండు మన్నింపుమా॥

ఉ॥ భక్తు డవధ్యుడౌగద, కృ । పానిధి, త్వత్చరణాబ్జచింత, నా
సక్తుడె, యీ యయాతి, గుణ । సాంద్రుడు, వీనివధింప నెంచగా
యుక్తమె, తండ్రియే సుతు న । యో వధ జేయదలంచునే, భవ
ద్భక్తుల నెల్లవారమును, । పాలనసేయగదే, రఘూత్తమా॥

అంజ—అంగదా! ఆ దయాసాగరునకుఁ దొలుత నాసాష్టాంగ దండ ప్రణామంబు లెఱింగించి; నావాక్యములుగా, నిట్లువిన్నవింపుము

శా॥ రామా! యింతటి యాగ్రహంబు,మెయి, నీ। రాజన్యునిన్ ద్రుంపగా
నీమంబుంగొన, కారణంబసలు, లే । నేలేదు; మానీంద్రుపై,

మోమోటంబున, భక్తవర్యు వధకున్ । మూర్ఖున్న,లోకాన, శ్రీ
రాముం, డార్తశరణ్యు డన్న నుడి, దూఱంబౌ, నుమున్ బ్రోవుమా॥
సీ॥ శరణాగత త్రాణ । బిరుదము భువిఁ జిర
స్థాయిగా నిల్పుట । ధర్మమనుము
అరినైన, శరణన్న । కరుణఁజూచెడు కీర్తి
నాచంద్ర తారార్క । మందుమనుము
భక్తవత్సలు శౌర, । భద్రాత్ముఁడనుమాట
వ్యర్థంబొనర్పక । వరలు మనుము
ఆత్మబాంధవుల ని । ట్లన్యాయముగఁ జంపఁ
దలపఁ మీబోంట్లకు । తగని దనుము
తే॥ గీ॥ యెదుగు నీకెన్నఁడున్ బల్క । యెఱుగననుము
యెఱుగ కీతనికి శరణ్య । మిచ్చితనుము
మన్ననల నొందఁదగిన యా । పన్నుఁడనుము
ఈ యయాతిని బ్రీతితో । నేలు మనుము॥
యయా—అంగదా! ఆ దీనమందారునితో నావిన్నపముగూడ యెుం
డెఱింగింపుము.
సీ॥ చక్రాతి నాతిగా । సలిపిన నీ పద
నీరజములకు జో । హారులనుము
కూరకాకాసురు । నేరము లెన్నక
మనిపిన నీకు వం । దనములనుము
శబరి యుచ్ఛిష్టమున్ । గబళించి, నోమిన
నీమూర్తి కిదియె ప్ర । ణామమనుము
అరి సోదరుండని । యైన నెంచక విభీ
షణుఁబ్రోచు నీకు నా । ప్రణతులనుము
తే॥ గీ॥ భార్యపుత్రులు గూడ నీ । భక్తులనుము
యెప్పుడును నీ చరణ దాసు । డీతడనుము
కలనుసైత మన్యము నాత్మ । దలచడనుము
కరుణఁజూపి యీదీనుని । గావుమనుము॥

సుగ్రీ—కుమారా! నా వాక్యములుగా నిట్లు విన్నవింపుము.

తే॥ గీ॥ దీనజన పోషకుఁడవు కా । దే మహాత్మ
యీ యయాతియు దీనత । నిందుజేరె
నీవిని వధింప న్యాయమా । వీరవర్య
దయను జూపి రక్షింపుమో । దానవారి॥

ఆంజ—అంగదా! నాప్రార్థనలగ జానకీ సౌమిత్రులతో గూడ నిట్లు విన్నవింపుము.

చ॥ జనకునితోడ కయ్యమిటు । సంధిలె, భక్తులఁగావుచుంచుఁ, నీ
యని వలదంచుఁ జెప్పదగు । నమ్మరో, జానకి నాథుతోడ, నే
మనుమును లక్ష్మణా విధిని । యన్నయుఁ దమ్ముఁడు నాఁజెలంగియున్
మనము దురంబునన్ రిపుల । మాడ్కిని పోరగనయ్యె నక్కటా॥

రక్షించుట కంగీకరింపకున్న యుద్ధమునకు సిద్ధము కమ్మని రామభద్రున కెరింగించి రమ్ము.

అంగ—యిక నే పోయివచ్చెదను. [అని నిష్క్రమించును].

సుగ్రీ—క్షుద్బాధ మిక్కుటముగ నున్నది. ఫలవనమునకుఁ బోవుదము రండు. [అందరు నిష్క్రమింతురు].

తెరపడును.

---

## చతుర్థాంకము—ద్వితీయ రంగము

[రాముడు, నారదుడు ఉచితాసనముల నుపవిష్టులైయుండ తెరలేచును]

నార—రామచంద్రా! యెంతమాటంటివి. దేవాదిదేవుడవైన నీతోడ హాస్యోక్తులాడుటయా.

మ॥ అవతారుండవు, వేదవేద్యుడవు, ది । వ్యాంభోజ పాదుండవున్
భువనాతీతుడవైన నీదెసను । బొంకుల్ పల్కి, భక్తుండనై
యవమానంబు ఘటింపనెంతునె, నిజం । బౌ కాదిం, కెంతెల, రా
ఘవ యాయంగద రాయబారమున ని । క్కంబంతయుఁ వ్యక్తమా॥

రాము—అంగదుడు రాయబార మరుదెంచుచుండెనా?

నార—అవును. యింక కొలదికాలముననే యిచ్చటకు రాగలడు. కాని రామచంద్రా! నీచరణ దాసుడైన మారుతికిది కానిపని. యింత విశ్వాసహీనుడగుటయా. నీవు వధింతునని ప్రతిన బూనుటయు, తాను రక్షింప సమకట్టుటయునా? యింత గర్వమా!

చ॥ యెరిగి భవత్ప్రతిజ్ఞ, ధర । ణీశ్వరు గాచు తలంపు నాత్మలో
మరువడు, భక్తుడయ్యుఁ దగు । మన్ననలందగ "నాయయాతి నిన్
పరుగునదెచ్చి నీదెసకు । పాలన సేయుము నీప్రతిజ్ఞ నో
పరమ దయానిధే యనడు" । పావని యెంతటి క్రూరకర్ముడో॥

రాము—చెట్టుచెడుకాలమునకు వేరుపురుగు లుద్భవించుట సహజము.

నార—రామా! అయినను భక్తునకును పుత్రునకును భేదములేదు. యీనిర్హేతుక వైరము నీ పుత్రులతోఁడనే కదా! ఒకులు నీ కెదిరింగింప నసమర్థులు. యిక నేనరిగెద సెలవొసంగుము.

[అని ముందునకు వచ్చి]

తే॥ గీ॥ వధయొనర్పఁగ రాముడు । ప్రతినపట్టె
వాని రక్షింప సమకట్టె । పవనసుతుడు
యిర్వురున్ సములే, యిక । నెట్టులైన
కలన జరుగకపోదు, నా । కాంక్షతీర॥

[అని నిష్క్రమించును].

రాము—[తల పంకించుచు] కాలవైపరీత్యము, భక్తాగ్రేసరుడై, నా యాజ్ఞానువర్తనుడై యీవరకు నాకనేక మహోపకారము లొనర్చిన మారుతి రణాంగణమున నను ప్రతిఘటించి నిల్చుటయా? నాతోఁడ కయ్యమొనర్చుటయా? యీవార్త జానకి విన్న నెంతచింతిల్లునో? హనుమా! నీకునాపైగల భక్తి విశ్వాసములిప్పుడే యంతరించెనా? నే వధయొనర్పఁ బూనినవాని రక్షింపఁ సమకట్టితివా? యిట్లొనర్తువని కలనైనఁ దలపనైతినే. నాయాత్మబాంధవుండవని యెంచితినే. సీతావియోగ దుఃఖానల జ్వాలలకుంజిక్కి యన్వేషించుచు ఋష్యమూకాద్రికి నే ననుజన్యు సహితంబుగ నరుదెంచినపుడు, నాకు సాష్టాంగ

దండ ప్రణామంబులొనర్చి సహోదర దౌష్ట్యకృత నిజదారాప హరణ దండహ్యమానసుండైన సుగ్రీవునితోడ నాకు సఖ్యముం గూర్చి దశాననాపహృత భువిజా విసర్జితామూల్యాభరణ ముల నాకుంజూపి కొంత దుఃఖోపశమనం బొనర్చి మదాజ్ఞా పరిపాలనా కాంక్షితుండై బహుయోజన విస్తీర్ణ గభీరపారా వారంబును లంఘించి, బాహుబల పరాక్రమ విక్రమోపేతా నేక దానవ సంరక్షిత లంకారాజ్యమున్‌జొచ్చి, రావణ ప్రేరిత క్రూరరాక్షసాంగనా బాధిత దుఃఖాక్రాంతయైన జానకింగాంచి ముద్రికనిచ్చి, అక్షయాద్య నేకాసుర ప్రాణాపహారియై లంకా దహనం బొనర్చి, నాకడకరుదెంచి మైథిలి సేమవార్త నెరిం గించి ముదంబొనర్చి, దశకంఠ బాణప్రయోగ కారణమూర్ఛిత సౌమిత్రీ ప్రాణరక్షణార్థమై సంజీవినిన్‌దెచ్చి బ్రతికించి, లంకా విజయ సహాయభూతుడై, సీతాసహితంబుగ నన్నయోధ్యకుం జేర్చి సింహాసనా సీనునిన్‌జేసిన కృపాళుడు, ప్రాణతుల్యుడగు మిత్రుడు, భక్తాగ్రేసరుడు, పుత్రుడునైన మారుతితో ననిసలు పవలయునా. నారిసారించి యాతనిపై బాణప్రయోగ మొన ర్పవలయునా. దుర్విధీ! యెంతటిచేటుం గూర్చితివి. [అని విచారగ్రస్తుడైయుండును.]

[అంత లక్ష్మణ, శత్రుఘ్నులు ప్రవేశించి చూచి]

లక్ష్మణు— [ఆశ్చర్యముతో] సహస్రకిరణ తేజోవిరాజితుండగు శ్రీరామచంద్రుని మోముతమ్మి యేలకో వాడియున్నది. దీర్ఘవిచార సాగరమున మునింగి మేమిట కరుదెంచినది కూడ యెరుంగకుండెనే!

ఉ॥ ఇమ్మహనీయమూర్తి, యెపు । డేనియు మేమరుదేర చేరగా
రమ్మని మమ్ము ప్రేమమెయి । గ్రమ్మరతాబిగిం గౌగలించి, నే
మమ్ము లెరుంగు, నేడకట । మమ్ములగాంచడు, పల్కు లేదు, మో
దమ్మును కాంతి దక్కెనదె । తానిటులుంటకు హేతువేదియో॥
యే దురంతుండైన రామచంద్రున కెగ్గొనరించెనా? యెగ్గొన

రించి యీభువిపై నికజీవించి యుండగలడా!

భరతుడు—[ప్రవేశించి] జగదానంద దాయకుండైన రామభద్రుని కెగ్గొనరించి యెవడు జీవించియుండగలడు. [అని రామునిజూచి] సౌమిత్రీ! అన్నగారికీ నిశ్చేతుక విచారమేమి?

లక్ష్మ—యేమో దుర్గ్రాహ్యముగ నున్నది.

భర—రామచంద్రా! జగద్వంద్యుడవైన నీకీ విచారమేల? యే ధూర్తుండైన నీదెస నపచారంబొనరించెనా? నీభక్తుల నేక్రూర రాక్షసుండైన బాధించుచుండెనా? యేదురాత్ముండైన నిను నిందించుచుండెనా? అట్టి తుచ్ఛుడెవరైన నున్నచో చెప్పుము. అజ్ఞాపింపుము. వానినిప్పుడే నాల్కలుగోరుదున్న నాబాణాగ్ని కింధనమును గావించెదను.

రాము—సోదరులారా! మీయూహలన్నియు పొరపాట్లు. నావిచారమునకు కారణమేదియు కాదు. యీవిచార మూరక పోవునదియును కాదు. యేమని చెప్పుదును.

మ॥ గురునాజన్ బరిపాటిజేసి, యొక భ । క్తున్ జంపు యోగంబు, చే
కురె నయ్యోయని, కుందుచుండ, నకటా । గోష్పట్టుపై నెంతో దు
ర్భరమౌ రోకటిపోటు మాడ్కి విల స । ద్భక్తుండు, పుత్రుండు, కే
సరిసూనుండును వైరియయ్యెనని నా । స్వాంతంబు ఖేదించెదున్.

లక్ష్మ—[విచారముతో] హనుమానుడు వైరియా. అదెట్లు?

రాము—యెట్లేమున్నది. యయాతికాత డభయుం బొసంగుటచేత.

లక్ష్మ—హా! దుర్భరము! దుర్భరము! పవనాత్మజా! యిది నీవెరిగి చేసినపనియై యుండదు. యెరింగియేయున్న నింతటి విపరీతము సంభవించునా?

ఉ॥ యెన్నిదినంబులో, రఘుకు । లేశ్వరుసేవల, నీవు నేనునున్
అన్నయుఁదమ్ముడున్ బలె వ । నాంతర సీమలనుంటి, మింక నే
మున్నది బాంధవంబు మన । కో కపిపుంగవ సంగరావనిన్
తన్నుకొనంగ జూచెదు వి । ధంబలరాకె నటన్న నయ్యయో.

భర—హనుమా! రామభద్రునితోఁడనే కయ్యముఁ కియ్యకొంటివా?

శత్రు—విధి యనుకూలించనప్పుడన్నియు నిష్ఫలమైనగూడు చుండును.

తెరలో—దశరథతనయు లెచ్చట? దశరథతనయు లెచ్చట?

శత్రు—యెవరివీ వాక్యములు?

రాము—అంగదుడై యుండనోపు. లక్ష్మణా నీవేగి యాతని నాహ్వా నించుకొని రమ్ము. [అంత లక్ష్మణుడు నిష్క్రమించును].

భర—యిప్పుడీత డేమని చెప్పునో.

శత్రు—తినఁబోవుచు రుచులడుగనేల.

[అంగద సహితముగ లక్ష్మణుడు ప్రవేశించును.]

అంగ—దశరథ తనయులకు వందనములు.

శ్రీరా—అంగదా!

మ॥ గణనాతీత పరాక్రముండు, నిజభ । క్తశ్రేణిలో మిన్న? పా
వని నేమంటె, హితుండు సద్గుణుడు నా । ప్రాణంబు, సుగ్రీవుడున్
మనునే సౌఖ్యతమేధకున్ నిధియు, స । న్మానార్హుడౌ జాంబవం
తునకుం భద్రమె,తక్క వానరుల కెం। దుం సౌఖ్యమే చెప్పుమా.

అంగ—రామా! నీకృపావృష్టి మాపైఁగురియుచున్నంత వరకు మా క్షేమమున కేకొరంతయుఁ గలుగదు.

రాము—అంగదా మరియొకమాట నడిగెదను!

ఉ॥ ప్రాణముమాత్ర మొక్కటియె । పావనికిన్ మరి నాకు, నెట్టులో
మేనులు రెండుగాఁజెలగు । మిమ్ముల నెవ్వరి నెందుఁజూచినన్
పావనిఁగాంచి నట్టులనె । భావనలో గడు సంతసింతు తా
మానసమందు నెంచునొకొ । మారుతి నన్ను భజించి మించునే.

అంగ—రామచంద్ర ప్రభూ! యెంతమాటంటిరి. మారుతి మిమ్మెన్నడైన స్మరించునా యనియా? భవన్నామామృతమే జీవనాధారముగ నెంచు మారుతి మిమ్ము మరచునా?

సీ॥ భోజ్యంబు లొల్లడు । భువనైకవంద్య, తా
రక మంత్రరాజ, ధా । రకముఁ దక్క
పానీయ మొల్లడు । పరమపావన, దివ్య
నామామృతా స్వాద । నంబుఁదక్క

అన్యాయమున్ విననొల్ల । డార్తజనావన
కలుష రాహిత్యమౌ । కథలఁదక్క
కలనైన నొల్లడు । పలవరింపగ లాతి
పలుకు, "రామా"యను । పదముఁదక్క
తే॥ గీ॥ అరయ నొల్లడెట్టిదియు, న । సంతకోటి
దివ్య తేజో విరాజిత । దీవిశాల
రత్నభూష పీతాంబర । రమ్య మంగ
ళాకృతిని దక్క, పావని । యవని రామ.
భర—అత డంతటి భక్తుడనుటకు సందియములేదు.
రాము—అవును.
తే॥ గీ॥ యెఱిగి యుండియుఁ బ్రగతిఁ । నేనడగితి
శంకగల్గుటచే మది, । సంతసంబు
గలిగె, నిప్పుడు, నీరాక । కారణంబు
దెలుపు మంగదా! నేవిన । వలతు దాని.
అంగ—రామచంద్రా!
చ॥ అనఘుడు, సత్యసీలుడు, ద । యాగుణ వర్తనుఁడౌ యయాతి రా
జను నొక రామభక్తుడు భ్రా । దంతరమందున భీతిఁజెంది, పా
వని శరణంబుఁజొచ్చె, కృప । వర్ధిలఁ దా నభయంబొసంగి, యా
తనిఁదరిజేర్చె మారుతియుఁ । గావక భక్తుడుగాన రాఘవా.
రాము—యెంతటి యపచార మొనర్చుటకు సాహసించెను! యెఱిగి
నాఁతోడ కయ్యమున కియ్యకొనెనా?
అంగ—యెఱిగియున్న నంగీకరించునా? వారు నాచేబంపిన రాయబార
వాక్యము లాలకించినచో నిందలియదార్థము నీకే విశదమగును.
లక్ష్మ—ఆ కొరతఁగూడ దీర్పుము.
అంగ—ప్రభువులారా! సావధాన చిత్తులరై యాలకింపుడు. నాచెప్ప
బోవు వాక్యములు మేధానిధియగు జాంబవంతునివి.
మ॥ కరముల్ మోడ్చి వచించుచుంటి వినుమో । కంజాక్ష, భీతార్తుడై
శరణున్ వేడ యయాతి, మారుతియు దీ । క్షంబూనె రక్షింప తా

నెఱుగన్ రామి భవత్ప్రతిజ్ఞ, నిపుడే । నేమందు, దుఃఖాంబుధిన్
దోరలెన్ సర్వమెఱింగి పావని, భవ । త్పూనుండు మన్నింపుమా.
ఉ॥ భక్తుఁడ వధ్యుఁడౌగద, కృ । పానిధి, త్వత్పరణాబ్జచింత నా
సక్తుఁడె యీయయాతి, గుణ । సాంద్రుడు, వీని వధింప నెంచగా
యుక్తమె, తండ్రియే సుతున । యోవధఁజేయదలంచునే, భవ
ద్భక్తుల నెల్లవారమును । పాలనసేయఁగదే రఘూత్తమా.
రాము—మంచిది. వీరాగ్రేసరుండైన యాంజనేయుం డేమనెను.

అంగ—తొలుత మీకనేక సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి
యిట్లని విన్నవించె.
శా॥ రామా! యింతటి యాగ్రహంబుమెయి, నీ। రాజన్యునిన్ ద్రుంపగా
నీమంబుంగొన కారణంబసలు లే । నేలేదు, మానీంద్రుపై
మోమోటంబున భక్తవర్యు వధకున్ । మూరొడ్డన్న, లోకాన శ్రీ
రాముండార్తశరణ్యుడన్ననుడి, దూరంబౌ, మమున్ బ్రోవుమా.
సీ॥ శరణాగతత్రాణ । బిరుదము భువి, చిర
స్థాయిగా నిల్పుట । ధర్మమనియె
అరినైన శరణన్న । కరుణఁజూచెడు కీర్తి
నాచంద్ర తారార్క । మందుమనియె
భక్తవత్సలు డౌర । భద్రాత్ముడను మాట
వ్యర్థంబొనర్పక । వరలుమనియె
ఆత్మబాంధవుల ని । ట్లన్యాయముగఁ జంప
దలప మీకొంట్లకుఁ । దగవి దనియె
తే॥ గీ॥ యెదురు నీకెన్న దున్ బల్కు । మెరుగననియె
యెరుగ కీతనికి శరణ్య । మిచ్చితనియె
మన్ననల నొందఁదగిన యా । పన్నుడనియె
నీ యయాతిని బ్రీతితో । నేలుమనియె.

రాము—మొదులకు వచ్చిన యుపోద్ఘాతములివి. యెరుగక శరణ్య
మిచ్చిన యాతడు యెరిగి వీట్పుచ్చగలిగెనా?

శత్రు—రాయబార వాక్యములన్నియు పూర్తియైనవా? యింకేమైన యవశేషములున్నవా?

అంగ—యయాతి విన్నపమొండు మిగిలి యున్నది. దీన దయాళో! ఆ యయాతి దుఃఖాతిరేకంబున డగ్గుత్తికతో నీతోనిట్లు విన్న వింపుమనియె.

సీ॥ చక్రాతి నాతిగా । సలిపిన, నీపద
నీరజములకు జో । హారులనియె
క్రూరకాకాసురు । నేరము లెన్నక
మనిపిన నీకు వం । దనములనియె
శబరి యుచ్ఛిష్టమున్ । గబళించి, నోమిన
నీమూర్తికిదియె ప్ర । ణామమనియె
అరిసోదరుండని । యైన నెంచక విభీ
షణుబ్రోచు నీకు నా । ప్రణతులనియె

తే॥ గీ॥ భార్యపుత్రులుఁగూడ నీ । భక్తులనియె
యెప్పుడును నీచరణ దాసు । డీతడనియె
కలనునైత మన్యము నాత్మ । దలపననియె
కరుణఁజూపి యీదీనునిఁ । గావుమనియె.

రామ—యెన్నిచెప్పినను పర్యవసాన మొక్కటియేఁగదా?

తే॥ గీ॥ మీ ప్రతిజ్ఞ యెట్లున్నను । మా ప్రతిజ్ఞ
తీర్చుకొనుటయె ముఖ్యము । తెలియుమనుచు
వారిభావము వెలిబుచ్చ । వచ్చెనిపుడు
మాకు కీర్త్యవమానము । మీకు నటుల.

అంగ—స్వామీ! మేమెన్నడునుఁ దలపలేదు. ఆపన్నులరక్షింపుమని మీ చరణ పద్మములకువాలి ప్రార్థించుచుంటిమి,

రామ—అటులైన మా ప్రతిన యెట్లుతీరవలయునని మీ యభిప్రాయము.

అంగ—ప్రభూ! ఘటనాఘటన సమర్థులు. సాక్షాదీశ్వరావతారులగు తమకు ప్రతిజ్ఞయా? సంకల్పమాత్రమున సర్వమును తమంత

కా సంభవింపగల మీకు ప్రతిజ్ఞాభంగమా! నిగ్రహానుగ్రహ ప్రవీణులగు మీకు ప్రతిజ్ఞాపాలనమా?

లక్ష్మ—అంగదా! రాముడు నిగ్రహానుగ్రహ సమర్థుడని యెరిగిన యాంజనేయుడా యయాతినేల విట్టుచ్చకూడదు.

అంగ—అట్లువీడుట వీరపురుష లక్షణమా?

భర—రాముడు వీరపురుషుడు కాడని మీయభిప్రాయమా?

అంగ—అట్లుతలచిన యెడల నింతదూరమేల రావలసివచ్చును.

శత్రు—మరి మీయభిప్రాయమేమి?

అంగ—భక్తుల దయతో పాలింపవలసినదని మాప్రార్థన!

రాము—అంగదా! యీవృథా వ్యాగ్రహయముతో ప్రయోజనము లేదు. శ్రీరాముడు సత్యవాక్పాలనుడనుమాట వ్యర్థమొనర్పఁ జాలను. నాకు నమ్మిన బంటై, భక్తుడై, ప్రాణసమానుడైనం దులకు శరణాగతరక్షణ దీక్షాబద్ధ కంకణుడౌట సంతసమే. కాని ముందాలోచింపక యయాతికిఁ శరణ్యమిచ్చుట తప్పు. అయినను యిప్పుడాతని విడిచిపుచ్చిన చాలునని మారుతితో చెప్పుము.

అంగ—రామచంద్రా! అటులైన మమ్మిక రక్షింపఁదలపలేదా?

లక్ష్మ—మిమ్ముల రక్షింపకుండనే యింతవారైతిరా?

అంగ—అయ్యా! నేనర్థించునది యొకటియు, మీప్రత్యుత్తర మింకొకటిగనున్నది. యయాతిని కరుణించి రక్షింపుమని మేము కోరుచుంటిమి.

భర—అట్లైన్నటికిని జరుగదని మేముఁజెప్పుచుంటిమి.

అంగ—రక్షింపఁదలపనిచో యుద్ధమునకు సిద్ధముఁగమ్మని మా యాంజనేయుఁడు చెప్పిరమ్మనిమె.

రాము—హనుమా! యెంతవాడవైతివి?

తే॥ గీ॥ భక్తుడవు నాకు నమ్మిన । బంటువయ్యు
దురమునందు నన్నెదిరింపఁ । నరయుటెన్న

గృద్దువచ్చి పిల్లను వెక్కి । రించునట్టి
కరణియయ్యె నేమననౌనొ । కాలమహిమ.

అంగదా! యిక నీవరుగవచ్చును.

అంగ—చిత్తము. [అని నిష్క్రమించును.]

శత్రు—ఆంజనేయుఁ డంతటి కృతఘ్నుఁడగునా?

రాము—గురునాజ్ఞా తిరస్కార మొనర్చుటకు మనం బంగీకరింపదు. భక్తుని వధింపక వీడ్చుచ్చి ప్రతిజ్ఞాభంగ మొనర్చుటకు సాహసింపజాలను. ఆతని రక్షింపసమకట్టిన ప్రాణతుల్యుఁడగు నాంజనేయుని యుద్ధ మొనర్పఁ జేయాఁడదు. యిది నాకుఁ బ్రాణసంకటమైనది.

లక్ష్మ—అగ్రజా! యిపుడు విచారించుటకు సమయముకాదు. ప్రతిజ్ఞాపాలన మవశ్యకర్తవ్యము. పోవుదమురండు. [అందరు నిష్క్రమింతురు.]

తెరపడును.

చతుర్థాంకము—సంపూర్ణము.



ఓమ్.

శ్రీ రా మా!

# హనుమద్రామ సంగ్రామము

## పంచమాంకము

### ప్రథమరంగము.

[ఆశ్రమో ప్రాంతము—విశ్వామిత్రుడొంటరిగ దీర్ఘాలోచన చేయు చుండగా తెరలేచును.]

విశ్వా—[తల పంకించుచు] ఔరా! నారదుడెంతటి వ్యూహమును బన్నినాడు.

చ॥ ననుఁబురిగొల్పి, రాఘవుని । నా ప్రతినన్ నెరవేర్పగోర మం
చని ననుబంపి, యాకలుషు । చయ్యన నా హనుమంతు పొంతకుం
జని శరణంబు వేడు మనె । సాహసమౌర, యయాతి రక్షణం
బున పవనాత్మజుండనికి । బూనఁగొనెన్ విభుతోడ నక్కటా!

నీరక్షీరముల వలె మెలంగుచున్న హనుమద్రాములకు సంగ్రామంబు ఘటిల్లజేయుటకే నారదుడీయుక్తిఁ బన్నియుండెననుట తథ్యము. భక్తుడైన యయాతిని వధింపవలసి వచ్చినందులకే కరుణామయుడగు రామచంద్రుని మనంబెంతయో కటకటఁ జెందినది. ఇక నాతని వధకుఁ బూనుకున్న ప్రాణతుల్యుడగు పవనాత్మజుని వధింపవలసి వచ్చెనన్న నెంత దుఃఖించియుండునో!

ధీరోదాత్తుడగు రాఘవుడు ప్రతిజ్ఞా పాలనమునకు వెనుదీయడు. సత్యవ్రత భంగమున కంగీకరింపడు, గురునాజ్ఞ యైనచో ప్రాణములనైన గోసియిచ్చును. అట్టి రఘుకులాంబుధి చంద్రుండయిన రాముడు నా యాజ్ఞయైనపిదప భక్తుల వధించుటకు వెనుకంజవేయునా? యీ పాపము నను కట్టికుడుపకుండునా? యయాతి యొనర్చిన కించిద్దోషమునకు నేనందున్నది కాంచక తొలుత నా దుష్టవశిష్టునకు నమస్కరించి నందులకు రోషకషాయిత లోచనుండనై నా కోపాగ్నికింధనములన్ దగుల్చుచున్న నారదుని కృత్రిమ వ్యాపారంబునకుంజిక్కి రామచంద్రునిచే ప్రతినంబట్టించి యింతటి చేటుమూడ చేసితిని. నారదా! నీ వింతటికూ్రరుడవా? నీ కింతటి కడుపుబ్బరమా? క్షుద్బాధాపీడితుండవై యున్నయెడల నిట్టికయ్యములా ఘటిల్లజేయునది. మహాత్ములయెడ నింతటి యుపచారమొనర్చుటయా. నే నిప్పుడేగి యుద్ధమును మాన్పింతునా? అట్లొనర్పగూడదు. అందువలన నావైరి వశిష్టునకు నేనవ్వ నింకను చుల్కనయగును. నేను పరిహాసములపాలగుదును. కానిమ్ము అంతటి మహాప్రళయమే సంభవించినయెడల నప్పుడే యుద్ధము మాన్పవచ్చును. మాన్పజాలకున్న నీశ్వరుడైన కరుణింపక పోడు. నేనుగూడ యిప్పుడే యుద్ధరంగమున కేగెదంగాక. రాముని కార్యదీక్ష నీక్షించెదగాక. ఈ యుద్ధముతో నాంజనేయుని ప్రతిజ్ఞాపాలన దీక్షయు దీనదయాళుత్వముంగూడ వన్నెకెక్కగలదు. [అని నిష్క్రమించును].

---

## ద్వితీయ రంగము.

[రణరంగము. హనుమదాదులు నిలిచియుందురు.]

హను—రామచందా్ర! నాయవి నక్కవినయములా! ముఖస్తోత్రములొనర్చుచుంటినా? ఆహా! యీభృత్యునిపై నెంతటి యనుమానముగల్గినది.

ఉ॥ తారకమంత్రరాజ మధు । ధారల గ్రోలగఁగోరుజిహ్వా యోం
కారుని మంగళాకృతిని । గాంచగ కాంక్ష వహించుకన్నులిం
పారగ నీచరిత్రలె య । హర్నిశముల్ వినఁగెంచు కర్ణముల్
కోరి జపించురోమములు । గూడ భవత్శుభ నామమంత్రమున్.
ప్రభూ! యింతయేల.

తే॥ గీ॥ యీ శరీరంబు నియ్యెడఁ । గోసి చూడు
మన్ని ప్రేవులు, ఫలలము, । లెన్ని రక్త
బిందువులు గలవో యన్ని । వేడ్కమీర
రామమంత్ర ముద్ఘోషించు । రాఘవేంద్ర॥

దాశరథీ! యీ మారుతి యెప్పటికిని మీ చరణదాసుడే. కాదు కాదు. మీ దాసానదాసుడు. మీ బంటు. మీయాజ్ఞ ననువర్తనుడు.

రాము—హనుమా! అటులైన నా భక్తుడవై యుండియు నేవధింప ప్రతినబూనిన వాని నీవెట్లురక్షింప సమకట్టితివి?

ఆంజ—తొలుత మీ ప్రతిన నేనెరుగను కావునఅట్లొనర్చితి. అయినను

తే॥ గీ॥ వధయొనర్పగఁ బూనిన । వాఁడ వీవు
వధనుఁజెందెడు వాఁడొక । భక్తవరుడు
గాన, రక్షింపఁబూనితి । నేను, భృత్యు
లను వధింపవనెడు ధైర్య । మునను రామ॥

రాము—మన్నింపఁదగని యపరాధమొనర్చి నపుడు భక్తుడైననేమి యెవడైననేమి దండింపక విడతురా?

హను—రామచంద్రా! యయాతి యే మపరాధమొనర్చెను?

రాము—రాజర్షి తిలకుండైన విశ్వామిత్రు నంతవానియెడ నపచార మొనర్చిన జాలదా?

హను—రామచంద్రా! విశ్వామిత్రున కపచార మొనర్చెనా? యయాతిరాజేంద్రుని గుణగతముల నీవెరుంగవా. నీభక్తాగ్ర గణ్యుడుకాడా. తారకామృతసారమే తనివిదీర గ్రోలువాడు గదా. అతని రాజ్యమున నెందుఁజూచినను రామశబ్దము ప్రతి

ధ్వనించుచుండునే. సత్యవాక్పాలనుడే, అర్థిజనకల్పద్రుముడే, సాంద్రగుణుడే, రామకథాశ్రవణముదప్ప యన్యవాక్శ్రవణము నొల్లడే, యెట్టినికృష్టుండైన రామభక్తుండైనచో జాతిమతవివక్షతలులేక యాతిథ్యమిచ్చితీరునే, అట్టి యయాతి పుత్రుతుల్యుడు అపరాధియా? వధ్యుడా?

రాము—ఓరీక్రోతీ. యికనేమి. యిన్నియుపోద్ఘాతములిచ్చుచు యెరుగకశరణ్య మిచ్చితినని బొంకెదవేమి. నీవి నక్కవినయములని నేననుటతప్పా?

తే॥ గీ॥ యెరుగ కభయమిచ్చితి నంటి। వెన్ని బొంకు
లాడి, ననుమోసగింపగ। యవసరమున
కెన్ని వందనములొనర్చి। తేమనందు
నేతిబీరకాయయె కాదె। నీమనంబు॥

ఆంజ—ప్రభూ పొరబడుచుంటిరి. మిమ్ము మోసగించుటకేనెంతవాడను. హృదయపూర్వక ప్రణామములొనర్చితినిగాని మృషలుగావు తమప్రతిజ్ఞ నేనెరుగక యభయమిచ్చినమాట నిజమే యనుమాట నిగమాంతవేద్యుడవగు నీ వెరుగనిదికాదు.

చ॥ యినకులభూషణా, తెలియ। కీగతి నేనభయంబొసంగి, యే
మనుదటుపై నెరింగి కథ। నక్కట, యేగతి రామచంద్రుతో
నని సలుపంగలాడ, నెటు। లాతని గాంచగలాడ, ప్రాప్తమే
మనిమదినెంతకుందితినో। యారయు మీహృదయంబుజంచియేన్.

రాము—మారుతీ! కావలసినపనియైనపిదప చింతించినంతమాత్రమున, ప్రయోజన మేమున్నది.

చ॥ అరయగనాదు భక్తుడవె। యాట నిజంబనుకొమ్ము, నీనమ
స్కరణము నాత్మశుద్ధిగనె। సల్పినదే యనుకొమ్ము, ముందుగా
నెరుగకనిట్టి దీక్షగొను। టే, నిజమాననుకొమ్ము, సర్వమీ
వెరిగిన యంతనైన, ధర। ణీశ్వరుఁవీడ దలంచినాడవే॥

హను—రామచంద్రా! యెంతమాటంటివి.

చ॥ శరణునొసంగి, యక్కతన । సంకటమేర్పడెనంచు, భీతిమై
తరి కరుడెంచువాని, గృప । దప్పుచు, వీడగఁజూడన్యాయమా
పరమ దయాసముద్ర, యిటు । బల్కగ నేటికటుల్ బొనర్చి వే
మఱుడగుకన్న ప్రాణములు । దూలుట మేలగుగాదె రాఘవా॥

రాము—వీరోచిత కార్యమొనర్చినందులకు సంతసమే కలుగుచున్నది. కాని, యిట్టితావుల నా వీరత్వమున్ జూపుట, పూర్వాపరంబుల యోజింపక యభయమీయవచ్చునా? తనకై యెదురుజూచు చున్న కష్టపరంపరల తమంత తామెదుర్కొను వారుందురా?

హను—రామచంద్రా! ప్రాణభీతిచే శరణుజొచ్చినచో నరియైనను సంకోచింపక నభయంబొసంగి శరణాగతరక్షణుడవను కీర్తినం దుమని నా కనేక పర్యాయములుదోబోధించితివే. అట్టిచో భీతార్తుడై శరణువేడిన రామభక్తున కభయంబొసంగుటకు పూర్వాపరంబుల నవలోకించుటయెట్లు, ప్రాణభీతిఁబాపిన పిదప గదా, ప్రాణాపాయకారణంబెరుంగవలె. నికముందుగనే యడి గిన భీతచిత్తుడు ప్రత్యుత్తరమీయఁగలడా? ప్రభూ దీనికికూడ నీవే తార్కాణము. ప్రబల విరోధులనుసైతము శరణన్న తోడనే నీ కరుణార్ద్రదృష్టులబరపి రక్షింపలేదా? ఒక్కరినైనను సమయింపగల్గితివా? తండ్రీ, అట్టియెడ నీ పుత్రుడనైన నాకు నీ దయాళుత్వమునందు సహస్రాంశమైన యలవడకుండునా? గురూపదేశము తిరస్కరింపఁ దగినదియా?

రాము—నిజము, మారుతీ నిజము. గురునాజ్ఞ తిరస్కరింపఁదగినది కాదు. అందువలననే, నేనుఁగూడ నీప్రతిన చేకొనవలసి వచ్చి నది. అట్లేనీకుఁగురుండనైననేను, యయాతిని విడుమని నీకాజ్ఞా పించుచుంటిని. నీవు నా యాజ్ఞ శిరసావహింపవలదా?

హను—శిరసావహింపవలసినదే. కాని యపకీర్తిపాలు కావలదా?

మ॥ ఆక్రరే, మారుతి, రామభక్తుఁడగు నా । న్యాయంబుగా మున్ను తా
శరణం బిచ్చియు, వీడ నర్థిసనుచున్ । జాటున్ గదా లోకముల్
తరమే, యీ యపవాదుఁ బోయ, గుణసాంద్రా దీనపాపంబు, చే
కుఱుఁగాదే యది వాయుమార్గ మిది నా । కున్ దోఁపదో రాఘవా॥

రాము—నీ కా భయ మక్కఱలేదు.

తే॥ గీ॥ గురువు నానతి నెంతటి । క్రూరమైన
జేయనగు దాని పాపముఁ జెంద । బోదు
తొల్లి భార్గవరాముఁడు । తల్లి తలను
గండ్రగొడ్డటఁ ద్రెంపఁడే । తండ్రియాజ్ఞ॥

హను—రామచంద్రా! గురువైన నేమి? మఱియెవ్వరైన నేమి? సత్కార్యము నర్పనాజ్ఞాపించిన వేరే యాలోచనము లేక యా యాజ్ఞను శిరసావహించి చేయుట కుద్యుక్తుఁడగును గాని, భృత్యుఁడు దుష్కార్యము నర్పుమని బోధించిన గురూపదేశ మంగీకరించునా? విషము నమృతమని నోటబోసిన కన్న సుతుఁడు మాత్రము త్రాగునా? ప్రభూ, నా విజ్ఞాపన మాలించి యయాతిని రక్షింపుము.

రాము—మారుతీ. యిట్టి సందిగ్ధావస్థలలో యుక్తిగ సంచరించుట ప్రతివారికిని విధియైయున్నది. ఇత్తరి నేనీతని కనికరించి ప్రతిజ్ఞ నుపాలింపక విడిచినచో రాముఁడు సత్యవాక్పాలనుడన్న మాట లోకమున రిత్తవోదా? నాకవమానము ఘటిల్లిన నీకు గలిగినట్లు కాదా?

హను—స్వామీ! నీభక్తుండనైన నేను నీపైగల మోహమోటంబున యయాతిని నీ కప్పగించినచో అంజనేయుండు భీరువనియు, అనృతవాదియనియు, కర్కశహృదయుఁడనియు, లోకము వేనోళ్ళ

జాటదా? ఆచంద్రతారార్కము నా కిదియొక కళంకమై నిలువదా? రామా! యీ తలవంపు లెవరికి?

రాము—హనుమా. నా యుపదేశంబులన్నియు నీదెస చెవిటివానికడ శంఖమూదినట్లగుచున్నవి. యెన్నివిధములలో యంగదునితోడ చెప్పిపంపితిని. యిప్పుడు నేను స్వయముగా ప్రతిమాలుకొనుచుంటిని. యెంతకును నీ మనసుమారకున్నది. మారుతీ, నా మాటవినుము.

తే॥ గీ॥ యెందుకయ్య యీ కయ్య మిం । కింకనైన
నా యయూతిని పెట్టవచ్చి । యరుగుమయ్య
పుణ్యమానయ్య, సత్కీర్తి । బొందుమయ్య
వధ యొనర్పలేనయ్య నిన్ । వజ్రదేహ॥

హను—రామభద్రా! అంగదుని ముఖంబున నేనెన్నియో ప్రార్థనలంపితిని. అవన్నియు వ్యర్థములైనవి. యిప్పుడు నేను స్వయముగ చరణములంటి ప్రార్థించుచుంటిని కాని నా ప్రార్థనలన్నియు బూడిదయందొలికిన పన్నీరుచందమగుచున్నవి. దేవాది దేవా! నా యీ ప్రార్థనలన్నియు యుద్ధము మాన్పదలంచియే కదా? కృపాళూ!

తే॥ గీ॥ భక్తవర్యులకగు సర్వ । భారమూని
రక్షసేయు బాధ్యుండగు । రామభద్రు
డే వధింప దలంచిన । నేది దిక్కు
కంచెయే చేను మేసిన । కలదె కాపు॥

రాము—హనుమా! నీవుచెప్పినది నేను కాదనుటలేదు. కాని, గురునకు నేనొసగిన ఘోరశపథము నే నొనర్పవలయును.

హను—ప్రభూ! యింకనూ శపథమనుచుంటిరా?

చ॥ నెప మఱుగాని నేననిన । నీన తలంచుము రామభద్ర నే
శపథ మొనర్చితంచు, పలు । సార్లు వచింపగ నేల, నిత్తరిన్
కృపగనఁదగ్గ భక్తుపయిఁ । గోపముఁ జూపి వధించుకన్న, నా
తపసుని ద్రోసి రాజని యు । దారతభృత్యుని బ్రోవగూడదే॥

రాము——ఓరీ ద్రోహి! యేమంటివి. తపసుని ద్రోసి రాజనిభృత్యుని బ్రోవవలయునా? అపర బ్రహ్మయగు విశ్వామిత్రుని యాజ్ఞ తిరస్కరించవలయునా? వివిధాస్త్రమంత్ర ప్రయోగంబుల నాకుం గూర్చి తాటకాద్యనేక దుష్టదానవుల నాచేఁ జంపించి బాహుబలపరాక్రమ వికమోపేతులకు ముట్టసాధ్యముగాని శివధనస్సు నాచే తుత్తునియలు జేయించి జానకీకరగ్రహణ భాగ్యముఁ గలుగజేసిన విశేషప్రతిభాశాలియగు విశ్వామిత్రుడు నీకన్నులకు తృణప్రాయముగ గోచరించుచుండెనా? మూఢచిత్తా! యిక నీ యవివేక వాక్యములకు సహింపఁజాలను.

హను——ప్రభూ! నాయవి యవివేక వాక్యములనియంగీకరించితిరికదా. వాటిని నీవు సహింపకున్న నింకెవరు సహింతురు. పుత్రుని దుండగములను తండ్రి భరింపకుండునా? అదియట్లుండి.

తే॥ గీ॥ నీదు భక్తుని రక్షింప । గాదె నేను
ప్రాకులాడుట, నా ప్రాణ । రక్షఁగోరి
నిన్ను ప్రార్థించినాడ నా । నీరజాక్ష
కోప మివ్విధి నా పయిన్ । జూప నకట॥

రాము——నాభక్తుని రక్షించిన నీకేమి? రక్షింపకున్న నీకేమి?

తే॥ గీ॥ నాదు భక్తుని రక్షింప । నీదు గొడవ
యేల, నే జాలనో యిపు । డేల వాగ్వి
వాద, మీకేల గోరెదు । ప్రాణరక్ష
నన్ను నీవె బాహుబల సం । పన్నుడ వయి॥

హను—రామచంద్రా! నా యీ బాహుబలసంపద నీ కృపవలనఁ గలిగినదే కదా? తండ్రీ!

చ॥ గొడవలు లేవు నీ కరుణ । గోరితి, నన్ శరణంబు వేడి యీ
తఁడు మనియుంట నా బలము । త్వత్కృపచేతనె కాదె కల్గె నే
విడచెద, వాని, కాతునని । ప్రేముడి । బల్కినఁజాలు, నేటి కీ
గడబిడ, యేది, వాకొనుము । కర్ణరసాయన మొప్ప రాఘవా॥

రాము—ఏమి నీ వాక్చాతుర్యము.

ఉ॥ బాలుడనంచు నెంచితివొ । పల్మరు బోధయొనర్చిచెప్ప, నీ
కేల వృథాప్రయాస, ధర । ణీశ్వరుదృంచుటయే నిజంబు, నే
పాలనఁ జేతు నాప్రతిన । బాహుబలాఢ్యులెదుర్పనెంచ, నా
కోలలు కీలికీలలౌన । గున్ బహుమానము నేర్పికైనమున్ ॥

హను—రామ! ఈ విధముగ నన్ను బెదరింప జూచుచుంటివా?

రాము—నిన్ను బెదరించుటకు నేనెంతటివాడను. మారుతీ! బాగుగ యోజించుకొనుము. నీ మేలుఁగోరి చెప్పుచుంటిని.

హను—యయాతిని విడువుమనుటతప్ప నింకేది చెప్పినను శిరసా వహింతును.

రాము—ఓరీ మూఢచిత్తా! నా సామవాక్యంబులు నీ బుఱ్ఱకెక్కినట్లు లేదు.

మ॥ చిరజీవుండను వజ్రదేహుడను న । క్షీణప్రతాపుండ నన్
గరువంబుండుటఁ జేసియేమొ, యనికిన్ । కాల్దువ్వగా సాగినా
వరరే మూర్ఖుడ, రామబాణమన, నే । మంచెంచితో యింక, నీ
చిరజీవత్వము రిత్తగాగశిరమున్ । ఛేదించు నిక్కంబుగన్.

హను—(నవ్వి) రామచంద్రా! రామబాణమునకు నేను భీతిల్లుదునని తలచితివా? ప్రభూ!

మ॥ చిరజీవత్వమదేల, వజ్రతను వ । క్షీణ్ప్రతాపంబు లే
ల,రఘూత్తంసను, రామబాణమునకున్ । లోనైన యస్త్రంబు,నా
దరి లేదా ఘనతారకంబొకటి, కా । దా? నీదు బాణాగ్నికే
నెరయైనన్ కొదువేమి, మోక్షపదమే । నీక్షింతు నీ సత్కృపన్.

రాము—యుద్ధమొనర్చుటకే దృఢసంకల్పుండవై యుంటివా?

హను—రామభద్రా!

మ॥ పలువాక్యంబులవేల నీ పదిరెటుల్ । భావించుచున్నన్, మహా
ప్రళయంబుద్భవమైన లోకములు బో । వ్వల్ నెట్టినన్ । బాణముల్
విడనైనన్ గమకింతుగాని, యతనన్ । వీట్పుచ్చగాజాల, నెం
దులకో రామ, యయాతి రక్షణము జే । యన్ దీక్షమై నిత్తరిన్.

రాము—ఓరీ దుర్మతీ?

మ॥ ఉమపన్జూచితి నీదురంబకటు యె । న్నో సామవాక్యాలచే
నడియూనయ్యెను నా ప్రయాస మిక నే । లా జాగిటుల్ చెట్టుకున్
చెడుకాలంబున వేరుపుర్వులటులన్ । చేకూరె మరోచనల్
చెడుగా నీకిక రమ్మనిన్ జరుపగన్ । జెండాడెదన్ నిన్నికన్.
(అని హనుమంతుని లాగికొని పోవును)

(అంత నొకవంకనుంచి నారదుడు ప్రవేశించి యుద్ధభూమిచూచుచు)

నార— మొన్ని దినంబులకు సిద్ధసంకల్పుడనైతిని.
తే॥ గీ॥ రామునకు, మారుతికి, నిల । రణముగూర్ప
వలయునని వితునాటితి । బహుప్రయాస

క్కోర్చి నీకోసి పెంచితి । నోహో, వృక్ష
మయ్యు, ఫలమిచ్చు నింక తు । ధాత్రి దీర.

యీ వనమును బొత్తుగా కలహాములు లభింపకుంటచే క్షుద్బాధ మిక్కుటముగనుండి కృశించుచున్నాను. మృష్టాన్న భోజనము లభించు కాలము చేరువైనది. అదె హనుమద్రాము లప్పుడే యుద్ధము సాగించినారు. యీ వచ్చువారెవరు చెప్పుమా? తెలిసినది. లక్ష్మణ సుగ్రీవులు పోరాడుచు యిటు వచ్చు చున్నారు. నేనొక ప్రక్క కొదిగెద. (అని నిష్క్రమించును)

[అంత లక్ష్మణ సుగ్రీవు లరుదెంతురు]

లక్ష్మ— ఓకీ మర్కటాధమా? నీబలంబే నెనుగనా?

శా॥ అర్ధాంగిన్ సహజన్ముకై విడచి, హే । యంబంచు లోనెంచ, కీ
వర్ధింపన్ రఘురాముండెంతో, కృపణుం । డై యుంటచే నీదు, ప్ర
త్యర్థిన్ ద్రుంపడె, నీబలంబు పుడు శా । ర్యం బెచ్చటన్ జేరె, నీ
వ్యర్థాలాపము లేల నన్ గెలువ శ । క్యంబౌనె నీ కిమ్మెడన్.

సుగ్రీ— ఓహోహో! యేమి యీ మేకపోతు గాంభీర్యము!

మ॥ దశకంఠుం డని బాణముల్ విడచి నిన్ । ధాత్రీస్థలిన్ వాల్చుచో
పసయేమూలకుంజేరె నేటికిపుడీ । ప్రాగల్భ్యముల్, నాడు నీ
యసువుల్ మారుతికాదె కాచె దగునే । యౌద్ధత్యమీవేళ, నా
ఘన నిల్వంగలవే రణస్థలిని, నే । దీ రమ్మికన్ జూచెదన్.

[అని యిర్వురు పరుగెత్త భరత జాంబవంతులు ప్రవేశింతురు]

భర— ఓరీ జాంబవంతా!

శా॥ వృద్ధాప్యంబుననుంటివి వేటికిటులన్ । గృద్ధుండనై వచ్చెవో
యుద్ధాసక్తిని, ముక్కుమూసుకొనిస । న్యోత్కృష్టమా మోక్షమున్

సిద్ధింబొందఁ దపంబొనర్పఁదగు, ప । శ్రీ శ్రీరఘూత్తంసుపై
శ్రద్ధాభక్తులనుంచి, చాల్ తొలఁగుమీ । చాలించియుద్ధంబికన్.

జాంబ— భరతా నీ కుయుక్తులు నాకడనా?

ఉ॥ సంగరమందు నన్ గెలువ । జాలనిభీతిఁదలిర్ప, శౌర్యమున్
భంగమొనర్పఁజూచెదవు । బాపురె, వీరుఁడవైన నిట్లు యోడన్
రంగమునందు నిల్వుము, దు । రంబున వృద్ధుఁడు జాంబవంతుఁడే
యొంగునొ, నీవె నా పటిమ । కోర్వక పాఱుదువో యెఱుంగ నా.

భర— ఓరీ వాచాటా, నీపటిమ యెంతవఱకున్నదో కనుగొనియే విడచెదను రమ్ము (అని యిద్దఱు పరుగెత్తి నొకవంక అంగద శత్రుఘ్నులు వత్తురు)

శత్రు— ఓరీ మర్కటాధమా? యుద్ధమున నేమనుకొంటివి?

తే॥ గీ॥ చెట్లులన్ గుట్టలన్ఁబడి । కుప్పిగంతు
లిడుచు పండ్లికిలించుట । యొడ, యుద్ధ
మందు నలుగుల తాకిడి । కాగు టోడి
యంగదా? నిల్వజాల వీ । వరుగుటెంక.

అంగ— శత్రుఘ్నా యుద్ధమున నేమియో నాకిపుడు క్రొత్తగా నేర్ప నక్కరలేదు.

తే॥ గీ॥ కుప్పిగంతులు వైచుటో । గుట్టలందు
పండ్లనికిలించుటో నేల । పౌరుషంబె
యున్న రారమ్ము పోరున । నోడఁ జేతు
నింక శత్రుఘ్న నిన్ను నా । యేపుఁ జూపి.

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

[నారదుడు ప్రవేశించి అటు నిటు పరికించుచు]

నార— (నవ్వి) సిద్ధ సంకల్పుడనైతిని. నేడు గొప్ప పర్వదినము. ఆహా! యింతటి మృష్టాన్నభోజనము నాకెన్నడును లభింప లేదు. కడుపు నిండినది. ఆహా! ఆంజనేయా భక్తుడవన నీవే కదా భక్తుడవు. యే భద్రసంధాయకుని నామామృతమును సర్వదా గ్రోలుచుందువో, అయ్యవతార పూరుషునితోడనే యుద్ధ మొనర్చుచుంటివే? యే యాయుధమును లేక, కేవల తారకమంత్రాయుధము చేగొని బాణపరంపరల నెదుర్కొను చుంటివే? జలధి తరంగములంబలెజనుదెంచుచున్న రామబాణ ముల నా శ్రీరామ నామస్మరణ మొనర్చుచు నిరుకేలలం బట్టుకొనుచు విసర్జించుచున్న నీ ప్రభావము నెంతనికొనియా డుదును. యిదంతయు నీ శరీరమునందలి ప్రతి రక్తబిందువు నందును జలించియున్న తారకమంత్ర ప్రభావము. రామ మంత్రమునందలి రామమహాత్మ్యము. తన్మంత్ర స్వరూపుం డైన రామునికడంగూడ లేదని లోకమునకుం జాటుచుంటివి. భళీ! మారుతీ! నేటితో నీవార్తత్రాణ పరాయణుండ వనుమాట లోకమునకు వెల్లడియైనది. (అని మరియొక వైపుం జూచి) రామ! రామ! జాంబవదాది వానరులు మూర్ఛిల్లిరి. లక్ష్మణాదులుకూడ దృగ్గోచరమగుటలేదు. వారును రణాం గణమున రక్తపు టేరులో పొర్లుచునేయుందురు. ఇక యుద్ధ సమాప్తి మార్గమాలోచింపవలయు. (అనిచూచి) అ వచ్చు నది విశ్వామిత్రునివలె నున్నదే!

[అంత విశ్వామిత్రుడు ప్రవేశించును]

నార— విశ్వామిత్రా! యెచటికి నీ ప్రయాణము?

విశ్వా— నారదా! యిందునిలిచి యుద్ధముంగాంచి యానందించు చుంటివా?

నార— ఆనందింపక దుఃఖింపుమందువా?

విశ్వా— అగునగును. పిల్లికి చలగాటము యెలుకకు ప్రాణసంకటము.

నార— విశ్వామిత్రా! నేననిన మీకుఁ గోపముగాని యిదంతయు నీస్వ యంకృతాపరాధమేకదా?

విశ్వా— నారదా! అర్ఘ్యప్రదానమునకు వేళయైనది. పోయివచ్చెదను.

[అని నిష్క్రమించును]

నార— [పక్కుననవ్వి] పాపము! తల తిరిగి నోటిలోనికి వచ్చినది. యు

ద్ధమునకంతము గలుగజేయుట కిదియే యదను— యయాతిని గొంపోయి కనులుమూసికొని విశ్వామిత్రు డర్ఘ్యమువిడుచు తరి యయాతి నాతని పాదములపై బడవైచెద. విశ్వామి త్రుని వ్రేలితో విశ్వామిత్రుని నేత్రమే పొడిచినట్లగు.

తే॥ గీ॥ అర్ఘ్యమొసగెడు వేళ, య । యాతి విభుని
యతని పాదములన్ ద్రోయ । నతఁడు మిచ్చ
మోము గాంచి యదరిపడు । మోసమునకు
అంత నేనేగి కౌశికు । పంత మడతు॥

[అని నిష్క్రమించును]

[అంత నొకప్రక్క నుండి హనుమద్రాములు ప్రవేశింతురు]

రాముడు—

ఉ॥ పైపయినేచుచుంటినని । బాణములన్ కయిఁబట్టి, యట్టిటుల్
చేపలమాడ్కినైచెదవు । ఛీ తులువాయికపైపఁబాల, నే

కోపముఁజూపిసన్, నిలువఁ | గూడునె యెంతటివారికైన, నా
దాపున, నీ మగంటిమియు | దర్పముఁబోలునె గడ్డిపోచ కేన్.

ఆంజనేయులు—

చ॥ మగటిమి కాదు, దర్పము | మాటయు లేదిక వీరధర్మమే
తెగఁబడఁజేసె నిన్ గెలువ | దేవునిశక్యమె దేవదేవ, నే
డెగిననుగాని, వాని తలఁ | ద్రుంపగజాలవు, చావనేను, నీ
దగుకృప నాపయిన్ వరలు | దాక నిజంబిక నేల రాఘవా.

రాము—యేమీ! నీవు చావవుగా?

తే॥ గీ॥ యేమి! చావవుగా నీవు | యెట్లు, తెల్పు
మిదిగో బాణమువైచెద | నిప్పుడె కాచి
కొమ్ము, నీ వాక్యమేమానో | కూళయైన
వాని నెట్లు జంపగలేనో | నేను చూతు.

[అని బాణము విడువ ఆంజనేయుడు మూర్ఛిలును.]

రాము—హా మారుతీ పడిపోయితివా! [అని దగ్గరజేరి] తండ్రీ, నిన్ను నాచేసేతఁజంపుకుంటినే, జానకి నీ మరణవార్త విని యెంత దుఃఖించునో. దుర్విధీ యెంతచేసితివి!

ఉ॥ యెన్నో యుపకృతుల్ సలిపి | యెన్నియొ సేవలఁజేసి, నాదుకన్
సన్నలనుండు నిన్నకట | జాలినిఁదూలి వధించినాడ నో
యన్న, తపింతు నిత్తరి ప్రి | యాత్మజుడంచు, సీతతో
నిన్ననిఁ జంపినాడనని | నే నెటులన్ వచియింతు మారుతీ|

హా నే నెంతటి మందభాగ్యుడను. ప్రాణసమానుడైన భక్తుని ప్రియపుత్రునిఁజంపిన పాపకర్ముడను. ఇక నేను మాత్ర మెవరి కొరకు జీవించవలయును.

ఉ॥ సోదరులెల్లఁజచ్చిరిక । నూనుము పావనిచచ్చె, భక్తులున్
మేదినిఁగూలి రేటికిక । మేనను జీవములన్ధరింప, నే
నీ దురమేమొనర్చుటకు । నెవ్వఁడుకారకు డా యయాతినిన్
బూదియొనర్చిబాణశిఖి । పోయెదఁమారుతిచెంత కిప్పుడే.

[అనిలేచి] ఓరీ దురాత్మా యయాతీ యెందుంటివి? [అని పోబోవ]

హను—[లేచి] రామా నిలు. నిలు. నే నింకనూ జీవించియేయుంటిని.

రాము—[తనలో] యీతఁడు బ్రతికినందులకు సంతసమే కాని యుద్ధమునకు మాత్రము సమాప్తికలుగలేదు. [ప్రకాశముగా] హనుమా! యిప్పటికైన నామాట వినుము. యయాతిని విడువుము.

హను—రామచంద్రా! యయాతిని నాప్రాణము లున్నంతవరకు విడువను.

తే॥ గీ॥ అంగదుండు గతించె, స । ర్వజ్ఞుఁడైన
జాంబవంతుడు హాతమయ్యె । సర్వసైన్య
సహితముగను సుగ్రీవుండు । చచ్చిపోయె
నిలను నే నింక బ్రతుకంగ । నేల రామ.

రాము—హనుమా! యెంతకును నీ మొండిపట్టు విడువకున్నావు. యిక నా ప్రయత్నములేదు. [అని బాణమును చేపట్టి]

తే॥ గీ॥ నేను దశరథాత్మజుడన । యేని, నాదు
జనని సాధ్వియౌనేని, నే । సత్య వాక్య
పాలనుఁడనేని, గురునాజ్ఞ । బరగునేని
పవనసుతు జంపుగాత, యీ । బాణమిపుడు.

ఈశ్వరుడు [త్వరితముగ ప్రవేశించి] రామచంద్రా! ఆగు మాగుము. బాణము సంధింపకుము. [అని చేయిపట్టుకొని]

రాము—దేవా! నన్నేల వారించెదరు.

ఈశ్వ—రామభద్రా! నీవు విష్ణుమూర్తివి. యీతడు భవిష్యద్బ్రహ్మ. మీ యిద్దరకును యుద్ధము చెల్లునా?

రాము—మహాత్మా! గురునిదెసనేనొనర్చిన ప్రతినయేమికావలయును

[అంత విశ్వామిత్ర నారద యయాతులు ప్రవేశింతురు]

విశ్వా—రామచంద్రా! యుద్ధ మాపుము.

రాము—మహాత్మా! అదేమి?

విశ్వా—నే సీతని ప్రాణదానమొసంగితిని.

రాము—అది యెట్లు.

విశ్వా—అది యంతయు నీ నారదుని యుక్తి.

రాము—ప్రతిజ్ఞాభంగమున కోర్వగలనా?

ఈశ్వ—ప్రతినబట్టినది విశ్వామిత్రుని కొరకేకదా. ఆ విశ్వామిత్రుడే తిరిగి యుద్ధమాపుమనియెను.

విశ్వా—నిజము రామచంద్రా. గురు నాజ్ఞ నుల్లంఘింతువా?

హను—రామచంద్రా! రక్షమాం. రక్షమాం.

రాము—కుమారాలెమ్ము. దేవా. నా సోదరులు, నా సేవకులు......

ఈశ్వ—రామా! అదే వారందరునూ మూర్ఛదేరి వచ్చుచున్నారు చూడుము.

[అందరు లేచివచ్చి రామునకు నమస్కరింతురు]

రాము—నా మునులారా! లెండు. మహేశ్వరుని కృపవలన యుద్ధమంత రించినది. నేడు మహా సుదినము.

నార—రామా! నిజముగనే సుదినము. విశ్వామిత్రుడు శాంతించి యాయోతికి ప్రాణదాన మొసంగుటచే గొప్పసర్వాదిమముకూడను! ఈశ్వరా! ఆశీర్వాదమునుగ్రహింపవలయు!

ఈశ్వరుడు—

తే॥ గీ॥ ధరణి సస్య సమృద్ధమై । దనరు గాత
చోర బాధలెల్లగనుక । తీరు గాత
కలహములుకాని సుఖములు । గాంచు గాత
రామభక్తులై భువినెందు । గ్రాలు గాత.

విశ్వా—తథాస్తు.

సర్వే జనాః సుఖినో భవంతు.



# అనుబంధములు

.o.——

## అనుబంధం 1

ఏకతాళం — కళ్యాణిరాగం

మురళీధరా, కరుణారసభరితా
పరమ దయానిధే, పాహి ముకుందా
ముని జన సేవిత, మోక్ష దాయకా
శౌరి మురారే, జగదోద్ధారా.

## అనుబంధం 2

రూపకం    మోహన

మందరగిరి ధారీ
బృందావన విహారీ
నంద నందనా, గోకుల, బాలా, గోపాలా
సుందర వదనారవింద, మందార మాలాధర.

## అనుబంధం 3

కేదారగౌళ — ఏకతాళం.

యదుకుల భూషణ, సదయాంతరంగ
కరివరదాయక, కంధిగభీర
గోపీజన గోవర్ధనధారీ
నంద కిశోరా, నవనీత చోర.

# అనుబంధములు

## అనుబంధము 4

బేహాగ్ — ఏకతాళం

తెలియ నెవరితరమా, నీ మహిమ
పలు వేషంబుల బరగుదు నహహా
దేవ దేవ — దివ్య ప్రభావా
సూత్రధారి, సర్వత్ర నీవెగా.

## అనుబంధము 5

భాగేశ్వరి — ఏకతాళం

ఇన వంశాంబుధి సోమా, రామా
తాటకాంతకా, దశరథరామా
సకలసురముని సన్నుతచరణా
శ్యామసుందరా, సాకేతనాధా.

## అనుబంధం 6

నాట — ఏకతాళం

నారాయణా, మాధవా
పాపనాశనా, భవవిదూరా
మూర్తిత్రయాత్మక, మోక్షదాయకా
నిరాకార, నిను, నిరతము గొలచెద.



